Photo by J. V. Sivarama Sastry



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఏ ఊరుదానవే ఏకాకీ ?

పంపినవారు :
ఏ. కె. దాస్ - పెనుగంచిప్రోలు

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక ఇంద్రజాలం, చిత్ర కథ, ఫోటో శీర్షికల పోటీ,
వార్తలు - విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


చందమామ (అన్ని భాషలలో)
విడి కాపీ **50** నయా పైసాలు. (**8** అణాలు)
సాలు చందా రు **6** లు.



చదవడం వల్ల
శక్తి క్షీణిస్తుంది...

పుష్టికరమైన ఆహారం పోయిన
శక్తిని చేకూరుస్తుంది. తుషార్‌తో
వండిన మామూలు వంటలు
కూడా పుష్టిని చేకూర్చడంలో
సాటిలేనివి.




# తుషార్

విటమిన్‌లుగల వనస్పతి

T1-1/56 తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్. కర్నూలు

క్రొత్త కోడక్

# 'వెరిక్రోమ్'

## ఏ వెలుతురులోనైనా ఎంతో స్పష్టమైన





ఎండలో, మసగ వెలుతురులో, ఫ్లాష్ వెలుతురులో—ఏ వెలుతురులోనైనా—కోడక్ 'వెరిక్రోమ్' పాన్ ఫిల్మ్ వాడితే ఎంతో చక్కని చిత్రములు వచ్చును. దీనికి కారణము యీ ఫిల్మ్ అన్ని రంగులను గ్రహించ గలదు! ఫొటోలను తీయుటయే పనిగా పెట్టుకున్న వారు వాడే రకమైన యీ ఫిల్మ్ మామూలు కెమేరాలతో వాడుటకు యిప్పుడు మొదటి సారిగా లభిస్తోంది.

కోడక్ 'వెరిక్రోమ్' పాన్ ఫిల్మ్ ఏ వెలుతురులోనైనా చిత్రములను తీయుటకు అనువైన ఫిల్ములలో సర్వ శ్రేష్ఠమైనది. దీని 3 విశేషాంశములు:

* రంగులన్నిటిని అద్భుతముగా గ్రహించ గలదు—ఒకే రంగుయొక్క రెండు ఛాయలలో భేదమును కూడ అది చూపగలదు
* ఎక్కువ స్పీడ్—పగటి వెలుగులో 80, కృత్రిమపు వెలుగులో 64
* సూక్ష్మమైన గ్రెయిన్—చక్కని ఎన్‌లార్జ్‌మెంట్లు తీయుటకు వీలుగా అతి స్పష్టమైన నెగెటివ్‌లను తీయవచ్చును

మీ కెమేరాలో కోడక్ 'వెరిక్రోమ్' పాన్ ఫిల్మ్ ఉపయోగించి మీరు కూడ ఫొటోలు తీసే నిపుణులవలె అద్భుతమైన చిత్రములను తీయండి!

కోడక్ లిమిటెడ్ (ఇంగ్లండులో సంస్థాపితము; కంపెనీ సభ్యుల బాధ్యత పరిమితము)
బొంబాయి - కలకత్తా - ఢిల్లీ - మద్రాసు

## నమ్మకమైన 'కోడక్' కెమేరాతో మీరు



రాజకపూర్‌వారి

# అబ్ దిల్లీ దూర్ నహీఁ

డైరెక్షన్ : అమర్ కుమార్

కథ : అఖ్‌టార్ మీర్జా  మ్యూజిక్ : దత్తారామ్  లిరిక్స్ : శైలేంద్ర * హస్రత్ జైపురి

**

# మాయాబజార్ కథాసంగ్రహం



బాల శశిరేఖ పుట్టిన రోజు పండుగకు సుభద్ర, బాలాభిమన్యుడూ వచ్చారు. అభిమన్యుని ధనుర్విద్యాసాహసం చూసి బలరాముడు ముచ్చటపడతాడు. శ్రీకృష్ణుని ప్రోత్సాహంతో, శశిరేఖ తన కోడలు కావాలని సుభద్ర కోరుతుంది. అలాగే జరిపిస్తానని బలరాముడు చేతిలో చెయ్యివేసి చెల్లెలికి మాట ఇస్తాడు. పాండవులంతటి అయిశ్వర్యవంతులతో సంబంధం నిశ్చయించినందుకు రేవతి పరమానంద భరితురాలవుతుంది.

శశిరేఖా అభిమన్యుడూ యుక్తవయస్కులయారు.

అప్పుడు ధర్మరాజుచేత దిగ్విజయంగా రాజసూయం జరిపించి వచ్చిన శ్రీకృష్ణుడు, బలరాములవారికి సత్యపీఠాన్నీ, శశిరేఖకు ప్రియదర్శినినీ కానుకగా ఇస్తాడు. ఎవరిచేతనైనా నిజాన్ని పలికించే మహిమ సత్యపీఠంలోనూ, ఎవరి ప్రియవస్తువును వారికి చూపించే మహిమ ప్రియదర్శినిలోనూ ఉంది. సరే సత్యపీఠాన్ని భద్రపరచి, అంతా ప్రియదర్శిని మహిమ ఏమిటో అని చూస్తారు. శశిరేఖ ఆ ప్రియదర్శినిని తెరవగానే ప్రేమగీతంతో అభిమన్యుడు కనిపిస్తాడు. రేవతికి ధనరాసులు కనిపిస్తాయి. బలరామునికి దుర్యోధనుడు కనిపిస్తాడు. శ్రీకృష్ణునికి పాచిక లెగరవేస్తూ శకుని ప్రత్యక్షమౌతాడు. ఆ దుష్టుడు ఏ కపటనాటక మాడుతున్నాడో అని కృష్ణుడు భయపడతాడు.

మాయాద్యూత విశారదుడైన శకుని, పాండవులను మోసం

చేసి వారి సకల రాజ్యాన్నీ, వారి సర్వసంపదల్నీ కాజేసి ఇస్తానని శపథంచేసి, దుర్యోధనుడిచేత ధర్మరాజును జూదానికి పిలిపించే ఏర్పాటు చేస్తాడు.

ద్వారకలో యాదవప్రముఖు లందరూ నృత్యవినోదంలో ఉండగా, ద్రౌపది ఆర్తనాదం విని శ్రీకృష్ణుడు ఆమె కభయమిచ్చి, పాండవుల రాజ్య సర్వస్వం దోచుకుని, దుర్యోధనుడు, వారి నడవులకు తోలాడని చెపుతాడు. సాత్యకి ప్రముఖులు కౌరవులమీదికి యుద్ధసన్నద్ధులు కాగా, వారిని వారించి, తాను దుర్యోధనుడికి బుద్ధిచెప్పి, పాండవుల రాజ్యం ఇప్పించి వస్తానని, బల రాముడు హస్తినాపురానికి బయలుదేరి వెళతాడు.

కాని వెళ్లిన పని ఒకటి; చేసుకువచ్చిన పని ఒకటి అన్నట్లు, బల రాముడు, దుష్టచతుష్టయం చేసిన అతి సన్మానాలకూ అతిముఖస్తుతులకూ ఉబ్బిపోయి, వారి కల్లబొల్లి మాటలు నమ్మి కౌరవులు ధర్మాత్ములు; పాండవులే దురాత్ములని నిర్ణయించడమే కాకుండా శశిరేఖను లక్ష్మణున కిచ్చి పెళ్లి చేస్తానని దుర్యోధనునికి మాటయిచ్చి వస్తాడు.

శ్రీకృష్ణుడు సుభద్రనూ అభిమన్యునీ ద్వారకకు తీసుకువస్తాడు. రాజ్య భ్రష్టులై వచ్చిన వీరిమీద రేవతికి మోజు పోతుంది. అన్యోన్యానురాగం గల శశిరేఖ అభిమన్యులు వెన్నెలరాత్రి నౌకావిహారం ఏర్పాటు చేసుకుంటారు. బలరాముడు వచ్చి శశిరేఖను లక్ష్మణునికిచ్చి పెళ్లిచెయ్యటానికి మాటిచ్చి వచ్చానని చెప్పగానే రేవతి బ్రహ్మానందం పొంది, మొరాయించిన శశిరేఖను మేడమీద నిర్బంధంలో ఉంచుతుంది. కాని వెన్నెల రాగానే అభిమన్యుడు వచ్చి, బాణాలతో నిచ్చెన నిర్మించి శశిరేఖను మేడమీదినుంచి దించి, ఇద్దరూ

రహస్యంగా నౌకావిహారానికి వెళతారు. భటులు వచ్చి ఈ వార్త చెప్పగానే బలరాముడూ, రేవతీ కోపంతో నదీతీరానికి బయలుదేరతారు. ఈ సంగతి తెలిసి శ్రీకృష్ణుడూ రుక్మిణీ వారికంటే ముందే వెళ్లి శశిరేఖాభిమన్యుల్ని రహస్యంగా పంపివేసి, రేవతీ బలరాములు తీరానికి వచ్చేటప్పటికి నౌకలోంచి తాము దిగుతారు. వీరిని చూసి భటులు పొరబడ్డారనుకుని రేవతీ బల రాములు శాంతపడి...అ వాతావరణకు ముచ్చటపడి తామూ కాస్త నౌకా విహారం చేసి వెళతారు.

లగ్నం నిశ్చయించుకుని శకుని ద్వారకకు వస్తాడు. వారు నిర్ణయించిన లగ్నం వరునికి అచ్చిరాదని బలరాముని సిద్ధాంతులు చెపుతుంటే, శకునితో బాటు శ్రీకృష్ణుడుకూడా ఈ పెళ్లికి లగ్నమే మంచిదన్నయ్యా అంటాడు. సంతోషంతో బలరాముడా లగ్నానికి పెళ్లి నిశ్చయం చేస్తాడు.

ఈ సంగతి తెలిసి, సుభద్ర రోషంతోనూ దుఃఖంతోనూ వచ్చి, నాకిచ్చిన మాట తప్పి నన్నవమానిస్తావా అన్నయ్యా అని బలరాముని అడుగుతుంది. ఇది నేను దుర్యోధన చక్రవర్తికి నిండుసభలో ఇచ్చిన వరం, ఈ పెళ్లి జరిపి తీరతానంటాడు బలరాముడు. "అయితే నీవు ప్రతాపాలకన్న ఐశ్వర్యం శాశ్వతమనుకుంటున్నావా?" అంటుంది సుభద్ర. "ప్రతాపాల పేరెత్తి నన్ను బెదరిస్తావా. వేయిమంది అర్జునులూ భీములూకూడా ఒక్క దుర్యోధనుని కాలిగోటికి పోల"రంటాడు బలరాముడు. ఆ మాట విని అభిమన్యుడు రోషపడి అయితే నిర్భయంగా స్వయంవరం ఏర్పాటు చెయ్యండి; ఆ కౌరవుల్నందర్నీ చెండాడి శశిరేఖను నేను దక్కించుకుంటా నంటాడు. అప్పుడు కృష్ణుడు చమత్కారంగా సుభద్రనూ అభిమన్యునీ మందలిస్తున్నట్టు

మందలించి కర్తవ్యం ఉపదేశించి, మీకు దిక్కున్నచోటికి పొమ్మంటాడు. వారు ద్వైతవనానికి బయలుదేరగా, శ్రీకృష్ణుడు రహస్యంగా వారిని ఘటోత్కచుని ఆశ్రమానికి చేర్చమని దారుకునితో చెపుతాడు.

ఘటోత్కచుడు తన అనుచరు లందరితో వీరవిద్యాపరీక్షల్లో ఉంటాడు. అప్పుడు అక్కడ ఉన్న భూమీ దుందుభిద్వారా, అభిమన్యుని రథం తన అరణ్యంలోకి రావటం చూసి ఘటోత్కచుడు ఆ వీరుడెవరో హతమార్చి రమ్మని తన అనుచరుల్ని పంపిస్తాడు. అభిమన్యుడు ఆ మాయా రాక్షసు లందర్నీ సునాయాసంగా జయించటం చూసి ఘటోత్కచుడు స్వయంగానే వచ్చి అభిమన్యునితో తలపడతాడు. ఉభయులకీ భయంకరమైన అస్త్ర యుద్ధం జరుగుతుంది. చివరికి ఘటోత్కచుడు ప్రయోగించిన ఒక శక్తి మాయ తెలుసుకోలేక దాని దెబ్బకు అభిమన్యుడు మూర్ఛపోతాడు. అప్పుడు సుభద్ర ధనుర్బాణాలు ధరించి కృష్ణార్జునుల పేరులు స్మరించి బాణం విడువబోగా, ఆ పేరులు విని బంధుత్వం తెలిసి శరణు మాతా అంటూ ఘటోత్కచుడు వచ్చి ఆమె కాళ్ళమీద పడి తన నెరిగించుకుంటాడు. అభిమన్యుడు మూర్ఛతేరగానే సోదరు లొకరినొక రాలింగనం చేసుకుంటారు. హిడింబకూడా వచ్చి సుభద్రాభిమన్యుల్ని తమ ఆశ్రమానికి తీసుకువెళ్లి పండుగలు జరిపి బ్రహ్మాండంగా ఆదరిస్తుంది.

తరువాత సంగతంతా సుభద్రవల్ల విని, "శశిరేఖను మాయగా ఎత్తుకురా, అభిమన్యుని కిచ్చి మన ఆశ్రమంలో పెళ్లి చేద్దా"మని చెప్పి హిడింబ ఘటోత్కచుని ద్వారకకు పంపిస్తుంది.

ఒక రాత్రివేళ ద్వారకకు వచ్చి ఘటోత్కచుడు అందర్నీ మాయా బద్ధుల్ని చేస్తుంటే, శ్రీకృష్ణుడు, ఒక వృద్ధుని రూపంలో అతనికి తారసిల్లి, తన మాయల కతడు చాలడనిపించి, చివరికి తెలివి తెచ్చుకుని ఘటోత్కచుడు తననే స్తోత్రంచేయగా, నిజరూపంలో కనిపించి ఘటోత్కచునికి అక్కడ చేయవలసిన పనులన్నీ ఉపదేశిస్తాడు.

ఇక నిద్రిస్తున్న శశిరేఖను మాయాబలంతో ఘటోత్కచుడు తన ఆశ్రమానికి తీసుకునిపోయి సుభద్రకూ, హిడింబకూ అప్పగించి, సరిగా ఆ లగ్నానికే శశిరేఖాభిమన్యుల వివాహం జరిపించండని చెప్పి, తాను మాయా శశిరేఖయై ద్వారకకు వచ్చి ప్రవేశిస్తాడు. మాయాశశిరేఖను పెళ్లికూతుర్ని చేస్తారు. లక్ష్మణుని తీసుకుని దుర్యోధనుడు పెళ్లికి తరలివస్తాడు. ఘటోత్కచుని రాక్షసులంతా పెళ్లిపెద్దలై "మాయాబజార్"లో పెళ్లివారికి మాయ కిరీటాలూ, మాయహారాలూ బహుమానం ఇస్తారు. ముందు పెళ్లికూతుర్ని చూపందీ పెళ్లి చేసుకోనని లక్ష్మణుడు పట్టుపట్టగా, ఘటోత్కచుడు మాయా శశిగా విడిదిలోకి వెళ్లి, భానుమతీ రాణినీ శకునినీ లక్ష్మణకుమారునీ చిలిపి చేష్టలతో బెదరకొట్టి అక్కడ వియ్యాలవారికి చేసిన విందుపదార్థాలన్నీ రహస్యంగా తాను గుటకాయస్వాహ చేసి చక్కా పోతాడు.

పెళ్లివారిలో లక్ష్మణుని సారథీ, దుర్యోధనుని పురోహితులూ మాకు కంబళ్లు కాదు గింబళ్ళు కావాలనీ, తల్పాలు కాదు గిల్పాలు కావాలనీ పెళ్లి పెద్దలుగా ఉన్న రాక్షసుల్ని తంటాలుపెడతారు. వాళ్ళు రాక్షసమాయతో నిర్మించి యిచ్చిన ఆ గింబళీ గిల్పాలతో రాత్రంతా నానాతిప్పలూ పడి కిక్కురుమనకుండా పెళ్లికి హాజరవుతారు.

ఇక పెళ్లిపీటలమీద కూర్చున్నప్పటినుంచీ లక్ష్మణకుమారుడు పేట్రేగిపోతాడు. మధ్యపట్టిన తెర తీసివేయమంటాడు. కాలు తొక్కించేటప్పుడు పాణిగ్రహణం చేసేటప్పుడు పెళ్లికూతురికి తన ప్రతాపం చూపాలని గట్టిగా నొక్కుతాడు. మాయాశశి అంతకన్న ఎక్కువగా నొక్కగా కటకటలాడిపోతాడు. జీలకర్రా బెల్లం శిరస్సున పెట్టేటప్పుడు శశిరేఖ కోతిగానూ కొండముచ్చుగానూ కనిపించి లక్ష్మణుడు బెదిరిపోతాడు. శకునీ దుర్యోధనుడూ ధైర్యంచెప్పి ఫరవాలేదు తాళి కట్టమంటారు. తాళి కట్టవచ్చేటప్పటికి శశిరేఖ పెద్దపులిగానూ భూతంగానూ కనిపించి లక్ష్మణుడు మూర్ఛపోతాడు. ఈ అల్లరి పెళ్లికొడుకును చూసి బలరాముడికి కోపంవస్తుంది. "మేమంతా మంచివాళ్ళమే. ఇది నీ కూతురు కాదు, మాయ శశిరేఖ రాక్షసి. ఇదంతా శ్రీకృష్ణుని మోసం" అని శకుని నిందిస్తాడు. ఎవరి మోసమో తెలుస్తుంది. ఈ పీఠంమీద నిలిచి మాట్లాడమని సాత్యకి సత్యపీఠాన్ని చూపిస్తాడు. దుర్యోధనుడు వారించినా వినక శకుని ఆ పీఠంమీద నిలుస్తాడు. ఇక దాని మహిమ చూడండి. "మాయచేసి పాండవుల రాజ్యం కాజేశాం. నీవు మా సాటివాడవు కాకపోయినా, పాండవుల కెప్పటికీ నీ సహాయం నీ తమ్ముడి సహాయం లేకుండా చేయటానికే మీ సంబంధం ఒప్పుకున్నాం. నీవొక వెర్రిబాగుల యాదవుడివి. నా మాయలో పడ్డా"వని శకుని నిజం పలుకుతాడు. ఈ మోసం తెలియగానే బలరాముడు మండిపడతాడు. అప్పుడు ఘటోత్కచుడు అతని అనుచరులు నిజరూపాలు దాల్చి కౌరవుల్ని నానాభీభత్సం చేస్తారు. వాళ్ళ కిరీటాలు కుంపట్లయిపోతాయి. హారాలు పాములయిపోతాయి. అర్థ

నాదాలు చేస్తున్న ఆ దుష్టచతుష్టయానికి బుద్ధిచెప్పి ఘటోత్కచుడు వారిని మూటకట్టి హస్తినాపురంలో పారవేయిస్తాడు.

చివరికి ఘటోత్కచుడు చేసిన పనికి సంతోషించి బలరాముడు, రేవతి, కృష్ణుడు, రుక్మిణీ అందరూ అతని ఆశ్రమానికి వెళ్లి శశిరేఖాభిమన్యుల్ని దీవిస్తారు. ఇదంతా నా పుత్రుడు చేసిన ఘనకార్యమని హిడింబ సంతోషిస్తే, కాదు ఇదంతా శ్రీకృష్ణులవారి దివ్యలీల అని ఘటోత్కచుడు స్తోత్రంచేయగా శ్రీకృష్ణపరమాత్మ అందరికీ విష్ణురూపదర్శనం ఇస్తారు. మంగళం.

"VIJAYA"



విజయవారి

రాబోవు చిత్రము

# అప్పుచేసి పప్పుకూడు



డైరెక్షన్ :

ప్రసాద్



నిర్మాతలు :

నాగిరెడ్డి & చక్రపాణి



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

మానవజన్మ సార్థకం కావటానికి అడ్డంగా ఉండే వాటిలో దురాశ ఒకటి. ఎందుచేతనంటే దురాశాపరుడికి మంచి చెడ్డల విచక్షణ ఉండదు, ఎంతఉన్నా తృప్తి ఉండదు. ఇతరుల ప్రోద్బలంమీద వాడు మంచిపని చేసినా వాడి మనసు దానిమీద ఉండదు. అటువంటివాడు తన ఆప్తులకూ, లోకానికీకూడా దూరమై, చుక్కానిలేని పడవలాగా అయిపోతాడు.

"నరకవాసి" [జాతకకథ] లో మిత్రవిందకుడు అలాటి దురాశాపరుడు. తల్లి చెప్పిన హితం వాడికి రుచించదు. వ్యాపారం చేసి ఇరవైలక్షలు సంపాదించినాకకూడా వాడికి సముద్రవ్యాపారం చేసి ఇంకా సంపాదించాలనిపిస్తుంది. సముద్రయానం చెయ్యొవద్దని అడ్డుపడిన తల్లిని కొట్టి వాడు బయలుదేరుతాడు. వాడిమూలంగా తమ కందరికీ కీడుమూడుతుందని నావికులు వాణ్ణి నడిసముద్రంలో తెప్పమీద వదిలేస్తారు. ఇంత జరిగినా వాడికి ఇంగితజ్ఞానం ఏర్పడదు. వాడు ఆ తెప్పసహాయంతోనే ఆ దీవికీ, ఈ దీవికీ వెళ్లి అక్కడ ఉండే పిశాచినులతో కాలక్షేపం చేస్తాడు. అఖరుకు వాడు నరకంలో అసిధారాచక్రాన్ని మోసే పాపిని చూసి అసూయ పడతాడు. వాడు చెప్పేహితం వినక ఆ చక్రాన్ని తన నెత్తికి తెచ్చుకుంటాడు.

సంపుటి 20 ఏప్రిల్ 1957 సంచిక 4

CHITRA

# తండ్రి - కొడుకు





# ఉగాది

ఈ నెల 1-వ తేదీన మనకు కొత్త సంవత్సరం ప్రారంభమవుతూంది. ఉగాదిపండగ కావటంచేత మనకిది గొప్ప పర్వం. ఈ రోజున—అనగా చైత్రశుద్ధపాడ్యమినాడే, ఆదిలో బ్రహ్మ సృష్టికర్మ ప్రారంభించాడని పురాణాలు చెబుతున్నాయి. ఇది మరీ గొప్ప విశేషం.

తెల్లవారుజామునే తలంటి పోసుకోవడం, కొత్తబట్టలు కట్టుకోవడం, ప్రతిపండగకూ జరిగే పనులే. కాని, అంతకంటే ముఖ్యమయిందీ—పరగడుపున ఉగాదిపచ్చడి తినడం మన సంవత్సరాది విశేషం. కొత్తచింతపండు, కొత్తబెల్లం, మామిడికాయ ముక్కలు, చెరుకుముక్కలు, వేపపువ్వు—వీటితో తాజాగా తయారయిందే ఉగాదిపచ్చడి. ఇందులో పడే దినుసులన్నీ మన కొత్తసంవత్సరానికి చిహ్నాలు. రకరకాల రుచులతో నోరూరించే ఈ పచ్చడి ఎప్పుడు అందుతుందా అని ఇంట్లో పిన్నలూ పెద్దలూ ఎదురుచూస్తూనే వుంటారు. ఇందులో కలిసిన రుచులలాగానే, జీవితంలో మంచిచెడ్డలన్నీ సమభావంతో అనుభవించాలని పెద్దలు ఈ పచ్చడిలోని అంతరార్థం చెబుతారు.

ఉగాదినాడు ఎలా గడిపితే సంత్సరం పొడుగుతా అదేవిధంగా గడుస్తుందని మనలో ఒక నమ్మిక వుంది. అందుకే, ఈ రోజున ప్రజల క్షేమం కోసం ఆనందంకోసం, ఆలయాల్లో బ్రహ్మాండంగా అర్చనలూ అభిషేకాలూ జరిపిస్తారు.

బంధుమిత్రులతో సహా, పంచభక్ష్య పరమాన్నాలతో చక్కగా భోజనం చేసుకుని, విశ్రాంతి తీసికొని, మధ్యాహ్నం పంచాంగశ్రవణం జరపటం, సంవత్సరఫలాలు చూచుకోవటం, మన ఆచారం. మన సావుకార్లు కొత్త లెక్కలు ప్రారంభించటమూ ఈ రోజునే. ఇవన్నీ అందరమూ చేస్తూ చూస్తూఉన్నవీ, అందరికీ తెలిసినవిన్నీ.

అయితే, ఈ కొత్తసంవత్సరం ఈ రోజునే ఎందుకు ప్రారంభంకావాలీ? అనేది ఒక ముఖ్యవిషయం: అదే యిప్పుడు తెలుసుకుందాం:

జీవయాత్ర గడవటానికి ఆధారంగా ఏదో ఒక వృత్తి ఉండాలికదా! వృత్తి అనేది మనం నివసించే ప్రదేశాన్నిబట్టి

ఏర్పడుతుంది. మనది వ్యవసాయ క్షేత్రం. కనుక మనకు సేద్యమే ముఖ్యవృత్తిగా ఉంటున్నది. వృత్తికి అనుకూలంగానే పూర్వంనించీ, సంవత్సరం ప్రారంభంకావటం, దాన్ని అవలంబించటం జరుగుతున్నట్టు కనిపిస్తుంది.

చైత్రశుద్ధ పాడ్యమినాడు ఏర్పడిన సంవత్సరాది ఒక్క మన తెలుగువారికే కాదు. మహారాష్ట్రులకూ కన్నడులకున్నూ ఈ తిథే సంవత్సరాది. ఈ రోజునే ఈ మూడు ప్రాంతాలవారూ పండుగచేసుకొంటూ, సమస్తకర్మలకూ చాంద్రమానాన్నే అనాదినుంచీ పాటిస్తూవున్నారు.

మన దేశంలో తక్కిన ప్రదేశాలన్నింటికంటే వింధ్య, శేషాచలం (అంటే తిరుపతి)—ఈ మధ్యనుండే ప్రదేశం పంటలకు చాలా అనుకూలమయింది. ఈ ప్రదేశంలో భూమి పడమటినుంచి తూర్పుకి ఏటవాలుగా వుండటంవల్ల నదులన్నీ పశ్చిమదిక్కునుంచి తూర్పుదిక్కుకు ప్రవహిస్తున్నవి. ఇదికూడా పంటలకు అనుకూలమైన విషయం.

హిమాచలప్రదేశంలో గంగా, సింధు, బ్రహ్మపుత్ర మొదలైన నదులకు మంచు కరిగి, ఎప్పుడుపడితే అప్పుడు, మండు వేసంగిలోకూడా వరదలు వస్తూవుంటాయి. కాని, వింధ్య శేషాచల మధ్యప్రదేశంలో నదులకు వానకాలంలోనే వరదలువస్తాయి. వీటివల్ల నష్టం కన్నా లాభమే ఎక్కువ. ఏమంటే, వరదలో వచ్చే వండుమట్టి పంట భూములకు బలాన్ని కూరుస్తుంది.

పంటల విషయం చెప్పవలసి వచ్చినప్పుడు ఈ మూడు ప్రదేశాల గురించి అనేకమైన విశేషాలున్నాయి. గుంటూరు, నెల్లూరు జిల్లాలలో సాగు అయ్యే మొలకులు ధాన్యమూ, కృష్ణా గోదావరులలో సాగుఅయ్యే రామసాగరాలూ, కిచిలీసాంబారు ధాన్యమూ, కన్నడదేశంలో మలనాడులో అవుతాయి. మహారాష్ట్రదేశంలో ఖాందేష్ లోనూ అవుతాయి. కాని, మరెక్కడ సాగుచేసినా పంటకాదు.

కృష్ణా, గోదావరి డెల్టాలలో తయారయ్యేధాన్యం ఇతరడెల్టాలలో ఎందుకు కావడంలేదు అనే ప్రశ్న వచ్చింది. శాస్త్రజ్ఞులు పాతిక సంవత్సరాలు పరిశోధనచేసి, ఇది జలస్వభావము భూస్వభావమునుంచీ కలిగిన ఫలితమని తేల్చారు.

మహారాష్ట్ర కర్ణాటక దేశాలలో పండే అపర ధాన్యాలు - అందులో కందులు,

సెనగలువంటి నాణ్యమైన గింజ భారత దేశంలో మరెక్కడా లేదు.

ఈ మూడుప్రదేశాలలో పైరు అయ్యే తృణధాన్యాలకూ అపరధాన్యాలకూ ఉండే రూప, రస, గంధాదులు భారత దేశంలో మరేప్రాంతలో పైరులకూ లేనేలేవు. ఈ మహా విశాలభూభాగంలో ఒక్క కన్నడలోనే పొడుగు పింజపత్తి పైరుకాగలదని వ్యవసాయశాస్త్రజ్ఞులు నిర్ధారణచేశారు.

సేద్యానికి ముఖ్యావసరమైనది పశు జాతి అభివృద్ధి. ఇందుకున్నూ ఈ ప్రదేశమే ఉత్తమమైందిగా కనబడుతూ వుంది. పశువులకు యోగ్యమైన గ్రాసం ఈ ప్రదేశంలో సమృద్ధిగా దొరుకుతుంది. అందుచేతనే—పొగరు పోతుదనానికి మహారాష్ట్రపు ఎద్దులూ, ఎంత బరువైనా లాగిపారెయ్యటానికి ఆంధ్రలో పెరిగిన వృషభాలూ, గుర్రాలతో సమంగా దౌడుతీయటానికి కర్ణాటకంలో పుట్టిన మైసూరుఎద్దులూ పేరు పొందాయి.

ఒకప్పుడు ఆస్ట్రేలియా దేశానికి ఎద్దులు అవసరమైనాయి. అక్కడి సేద్యగాండ్రు ప్రపంచమంతా తిరిగి తిరిగి, పూనానుంచీ, ఒంగోలునుంచీ, వేలకువేలు రూపాయలు పోసి ఎద్దులను కొనుక్కుపోయారు.

ఒకే సంవత్సరమానం గల ఆంధ్ర, కన్నడ, మహారాష్ట్రులు ముగ్గురకూ ఇంకా అనేక విషయాల్లో పోలిక లున్నాయి. భారతదేశంలో ఇతర భాషలవారికీ, ఈ మూడు భాషలవారికీ స్వభావంలో, స్వరూపంలో చాలా భేదం కనబడుతూవుంది. చూస్తూనే, స్వరూపాన్నిబట్టి వీరు ఆంధ్రులు, వీరు కర్ణాటకులు, వీరు మహారాష్ట్రులు అని నిర్ణయించడం కష్టం. కాని, మలయాళీ పంజాబీ, బాంగ్లా మొదలైన భాషల వారిని చూచీ చూడటంతోనే పొల్చి పట్టవచ్చు.

స్వభావం చూడబోతే, మరీ చిత్రం. కేవలం అవసరమైతేకాని ఈ మూడు భాషలవారూ ఇతర భాషలు నేర్చుకోరు. వీరి మధ్య కొన్ని వందల ఏళ్ల కిందట ముసల్మానులు చేరి, పాలకులై, ఉర్దూభాష అభ్యసించమని శాసించడం వల్ల నేర్చుకొనక తప్పిందికాదు. ముసల్మానులు ఈ మూడు భాషలనూ రాజకీయంగా అణగదొక్కారు. కాని వీరు, రాజకీయంగా ఎంత అవసరమో అంత వరకే ఉర్దూభాష నేర్చుకున్నారు.

ఏదేశంలో ఎంతకాలం నివసించినా, వీరు తమ భాషలను మరిచిపోరు. దక్షిణమేరువు (తమిళదేశము)కు అయిదు వందల సంవత్సరాలనాడు

సేద్యం నేర్పడానికి పోయి, అక్కడే నివాసం ఏర్పరుచుకున్న తెనుగువారు నేటికిన్నీ నిత్యవ్యవహారం తెలుగులోనే చేస్తున్నారు. తరతరాలనాడు తంజావూరు చేరిన మహారాష్ట్రులుకూడా తమ భాషను ఇప్పటికీ మరిచిపోలేదు.

ఈ మూడు భాషలవారిలో బ్రాహ్మణులు భూమిని సాగుచేసి జీవనం చేయడం అనాదినుంచీ వస్తున్నది. ఉత్తరాది బ్రాహ్మణులూ, దాక్షిణాత్య బ్రాహ్మణులూ కర్షకవృత్తిని ఈనాటికీ దూష్యంగా భావిస్తున్నారు. ఉత్తరాది బ్రాహ్మణుడు సిపాయిపని చేస్తాడు. కాని పొలంమాత్రం దున్నడు. దక్షిణాది బ్రాహ్మణుడు అన్నవిక్రయం చేస్తాడు కాని, పొలంచాయలకే రాడు.

ఈవిధంగా యోచించుకొంటూపోతే ఈ మూడు భాషలవారికీ ముఖ్యవృత్తి సేద్యమే అని చెప్పటానికి ఎన్నో ఆధారాలు కనబడుతున్నవి.

సేద్యానికీ సూర్యచంద్రులకూ ఎడతెగని సంబంధముంది. సూర్యసంచారంవల్ల ఋతువులు ఏర్పడుతున్నవి. చంద్రునివల్ల సస్యాల వృద్ధిక్షయాలు ఏర్పడుతున్నవి. ఈ ప్రాంతంలో ముఖ్యవృత్తి అయిన సేద్యానికి సూర్యచంద్రులతో ఎక్కువ ప్రయోజనముంది. అందువల్లనే సూర్యచంద్రుల సంచారాన్నిబట్టి మూడు ప్రాంతాలవారూ సంవత్సర నిర్ణయం చేసుకోవలసివచ్చింది.

ఈ విధంగా మన మూడుభాషలవారూ సూర్యునికి సంబంధించింది సౌరమానమనీ, చంద్రునికి సంబంధించింది చాంద్రమానమనీ పిలుస్తున్నారు.

ఇప్పటికి సంవత్సరాది పండుగలు ఎన్నో గడచిపోయినై. అయినా, ఈ హేవిళంబి సంవత్సరాది అనేకమైన విశేషాలతో కూడుకొనివున్నది. కొత్త రాజ్యాంగవిధానాలతో, కొత్త చదువులతో, కొత్త కవితలతో, కొత్తనాణాలతో ఈ సంవత్సరాదిని ప్రారంభిస్తున్నాము. ఇన్నిటికి మించి, మనకిప్పుడు శకమే కొత్తది వచ్చింది! మనపూర్వులు కని విని ఎరుగని ఇటువంటి చిత్రాలను ఈ కొత్త సంవత్సరంలో మనం చూడగల్గటం ఎంత అదృష్టం!

* * *

ఎల్లవారల హృదయముల్ పల్లవించె;
మరల నాశాలతలు పూచి పరిమళించె;
జనులకెల్లను నూతనోత్సాహ మొదవె;
నవ్యభావోదయంబయ్యె నరులలోన!

—'కావ్యకుసుమావళి'

# అట్టివారి బొమ్మ

అజ్ఞాతవాస దీక్ష నిమిత్తమై పంచపాండవులూ, ద్రౌపదీ తమ వేషాలు మార్చుకున్న అనంతరం ధర్మరాజు ముందుగా బయలుదేరి విరాటరాజు కొలువుకు వెళ్లి, "రాజా, నేను పూర్వం ధర్మరాజు కొలువులో ఉండేవాణ్ణి. నా పేరు కంకుడు. నాకు పాచికల ఆటలో ప్రావీణ్యం ఉన్నది. నన్ను మీ కొలువులో ఉంచుకోండి," అని కోరాడు. విరాటుడు సంతోషంతో అంగీకరించాడు.

ఈ లోపల ద్రౌపది సైరంధ్రీ వేషంతో విరాటనగరం ప్రవేశించి వీధుల వెంట నడవసాగింది. దారిలో ఆమెను చాలా మంది ఆపి, "అమ్మా, ఎవరు నీవు?" అని ప్రశ్నించారు. వారితో ఆమె, "నేను సైరంధ్రిని. ఎవరైనా నన్ను పోషించినట్లయితే వారికి సేవకురాలుగా పని చేస్తాను!" అని చెబుతూవచ్చింది.

ఈ వార్త విరాటరాజు భార్య అయిన సుధేష్ణకు తెలిసింది. ఆమె ద్రౌపదిని పిలిపించి, "నీవెవరు?" అని అడిగింది. దానికి ద్రౌపది, "అమ్మా, నేను ఇంతకు ముందు సత్యభామాదేవి వద్దా, ద్రౌపదీదేవి వద్దా పరిచారికగా ఉండేదాన్ని. నా పేరు మాలిని. నాకు కేశాలంకరణ, పూలమాలలు కట్టటం, అలంకరణ చెయ్యటం బాగా తెలుసును," అన్నది.

"నిన్ను అంతఃపురంలో పెట్టుకుంటే విరాటరాజుగాని, ఇతరులుగాని నీ అందానికి వశులైనప్పుడు నీకు ఇబ్బంది కలుగుతుందేమో?" అన్నది సుధేష్ణ.

"అమ్మా, నన్ను నా భర్తలైన అయిదుగురు గంధర్వులు అనుక్షణమూ కాపాడుతూ ఉంటారు. అందుచేత నాకు ఎవరి భయమూ లేదు!" అని ద్రౌపది జవాబిచ్చింది. సుధేష్ణ ఆమెను తనవద్ద ఉంచుకోవటానికి ఒప్పుకున్నది.

మరి కొంతసేపటికి వంటలవాడి వేషంలో భీముడు విరాటరాజువద్దకు వచ్చి, "మహారాజా, నేను వలలుడనేవాణ్ణి. నేను వంట చేస్తాను. నన్ను మీ కొలువులో ఉంచుకోండి. నేను అవసరమైతే మల్లయుద్ధంకూడా చేయగలను. కాని వంట చేయటం నా వృత్తి!" అన్నాడు. విరాటుడు ఆ ప్రకారమే భీముణ్ణి తన వంటవాడుగా నియమించాడు. రాజుగారి వినోదంకోసం భీముడు మల్లులను ఓడించడమేగాక, సింహశార్దూలాది మృగాలతో కూడా పోట్లాడి తన బాహుబలం ప్రదర్శిస్తూ ఉండేవాడు.




# నరకవాసి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో ఆ నగరంలో ధనికుడైన ఒక గొప్ప వర్తకుడుండే వాడు. ఆయనకు మిత్రవిందకుడని ఒక కొడుకుండే వాడు. ఈ మిత్రవిందకుడు ఎంతో పాపాత్ముడు. వర్తకుడు చనిపోయాక, ఆయన భార్య తన కుమారుడికి, "నాయనా, దానాలు చెయ్యి; నియమాలు పాటించు; ధర్మం అనుసరించు!" అని ఎంతో హితబోధ చేసింది. కాని వాడు తల్లి మాటలు కొంచెమైనా వినిపించుకో లేదు.

ఇంతలో కార్తీక పౌర్ణమి వచ్చింది. మిత్రవిందకుడితో అతని తల్లి, "నాయనా, ఇవాళ పుణ్యదినం. తెల్లవార్లూ విహారంలో ధర్మోపదేశం చేస్తారు. నీవు అక్కడ అందరితోపాటు పూజచేసుకుని, ఉపదేశం విని రా. తిరిగివచ్చాక నీకు వెయ్యి రూపాయలిస్తాను," అన్నది.

డబ్బుకోసమని మిత్రవిందకుడు సరే నన్నాడు. అతను ఉపదేశం వినటానికి వెళ్ళాడుగాని, ఒక మూల పడుకుని నిద్రపోయాడు. తెల్లవారుతూనే లేచి ముఖం కడుక్కుని ఇంటికి తిరిగి వచ్చాడు. తన కొడుకు ధర్మబోధకుణ్ణి వెంటబెట్టుకుని వస్తాడనే ఉద్దేశంతో అతని తల్లి వంటచేసి సిద్ధంగా ఉంది. కొడుకు ఒంటరిగా రావటం చూసి, "ధర్మబోధకుణ్ణి తీసుకురాలేదా, నాయనా?" అని అడిగింది.

"ఆయనను ఇక్కడికి తీసుకురావటం దేనికమ్మా? నా కాయనతో పనిలేదు!" అన్నాడు మిత్రవిందకుడు.

అతను భోజనంచేసి తల్లిదగ్గిర వెయ్యి రూపాయలూ తీసుకుని తన పనిమీద తాను వెళ్ళాడు. ఈ డబ్బుతో అతను వ్యాపారం చేసి త్వరలోనే ఇరవై లక్షల రూపాయలు సంపాదించుకున్నాడు.



"ఈ డబ్బు పెట్టుబడి చేసి సముద్ర వ్యాపారం సాగిస్తాను! ఇంకా ఎక్కువ డబ్బు సంపాదిస్తాను!" అనుకున్నాడు మిత్రవిందకుడు. అతను ఒక పడవ కొని దానిలో సరుకులు ఎక్కించి, సముద్రాల మీద బయలుదేరుతున్నానని చెప్పి పోవటానికి, తల్లివద్దకు వచ్చాడు.

అంతా విని తల్లి కంట తడిపెట్టి, "నాయనా, నాకు నీవొక్కడవే కొడుకువు! నీ దగ్గిర ఇంత డబ్బున్నదిగదా, ఇంకా డబ్బు సంపాదించి ఏం చేసుకుంటావు? సముద్ర ప్రయాణం క్షేమం కాదు. నా మాట విని ఈ ప్రయాణం మానుకో. ఇంటి పట్టున ఉండు!" అన్నది.

మిత్రవిందకుడు తల్లి మాట వినక; పోయి తీరాలని మూర్ఖించాడు. ఆవిడ తన కొడుకు చెయ్యి పట్టుకుని వెళ్ళవద్దని బతిమాలింది. మిత్రవిందకుడు తల్లిని కొట్టి, తన చేతిని విడిపించుకుని వెళ్లిపోయాడు.

ఆ రోజే అతని పడవ బయలుదేరింది. అది సముద్రాన్ని చేరుకున్న తరవాత ఏడు రోజులపాటు ప్రయాణం సరిగానే సాగింది. కాని ఎనిమిదవ రోజున నడిసముద్రంలో పడవ ఎటూ కదలక ఆగిపోయింది. ఈ దుర్ఘటనకు కారకులెవరో పడవలోనే వున్నారనే ఉద్దేశంతో నావికులు చీటీ వేశారు. చీటీ మిత్రవిందకుడికి వచ్చింది. నావికులు మూడుసార్లు చీటీ వేశారు. మూడుసార్లూ అది మిత్రవిందకుడికే వచ్చింది.



"నీ మూలంగా మా కంపరికీ ప్రమాదం జరుగుతుంది. నీ ఒక్కడికోసం ఇంత మంది చావటానికి వీలులేదు. కనక నీవు పడవ వదిలి పో!" అన్నారు నావికులు మిత్రవిందకుడితో. వాళ్ళు అతనికి ఒక తెప్ప ఇచ్చి దానిమీద అతన్ని ఉంచారు. మరుక్షణం పడవ శరవేగంతో కదిలి, మిత్రవిందకుడు చూస్తూండగానే కనపడకుండా వెళ్ళి పోయింది.

కాలక్రమాన మిత్రవిందకుడు తన తెప్ప మీద ఒక లంకను చేరుకున్నాడు. ఆ లంకలో అతని కొక స్ఫటిక భవనం కన బడింది. అందులో నాలుగు అడ పిశాచాలు కాపరం ఉంటున్నాయి. ఈ పిశాచాలు వారంరోజులు సరదాగా గడుపుతాయి; మరి వారంరోజులు అవి పాప ప్రాయశ్చిత్తం కోసం కఠోరమైన నియమాలు అవలం బిస్తాయి. మిత్రవిందకుడు ఆ పిశాచినులతో ఒక వారంపాటు ఇంద్రవైభోగాలు అనుభ వించాడు. పిశాచినులు వ్రతం ఆరంభించే సరికి అతనికి అక్కడ ఉండ బుద్ధికాలేదు. అతను తనతెప్పమీద తిరిగి బయలుదేరాడు.

అతను సముద్రంమీద వెళ్లగా వెళ్లగా మరొక లంక తగిలింది. దానిలో ఎనిమిది పిశాచినులున్నారు. మిత్రవిందకుడు వారితో కూడా వారం రోజులు గడిపి, వారు కఠోర వ్రతాలు ఆరంభించగానే మళ్లీ తెప్పమీద బయలుదేరాడు.

ఈ విధంగా అతను మరొక దీవిలో పద హారుమంది పిశాచినులతోనూ, ఇంకొక దీవిలో ముప్పైరెండుమంది పిశాచినుల తోనూ ఒక్కొక్క వారం గడిపి, ఆఖరుకు తన తెప్పపైన వేరొక లంకను చేరుకున్నాడు.

ఈ లంకలో ఒక పెద్ద నగరం ఉన్నది. దాని చుట్టూ గోడా, ఆ గోడలో నాలుగు



ద్వారాలూ ఉన్నాయి. అది ఉస్సద నరకం. అయితే మిత్రవిందకుడికి అది నరకంలాగా కనిపించలేదు, అందమైన నగరంలాగా కన బడింది. "నేనీ నగరంలో ప్రవేశించి దీనికి రాజునవుతాను!" అనుకున్నా డతను.

ఆ నగరంలో ఒకచోట మిత్రవింద కుడికి ఒక మనిషి కనిపించాడు. ఆ మనిషి తన నెత్తిన అసిధారాచక్రం మోస్తున్నాడు. దాని అంచు పదునుగా ఉండటంవల్లనూ, అది చాలా బరువైనది గనకనూ, ఆ చక్రం అతని తలలోకి దిగబడి పోయింది. తల నుంచి రక్తం ధారలుగా కారుతున్నది. ఆ మనిషి శరీరం అయిదుపేటల గొలుసుతో బంధించబడి ఉన్నది. అతను బాధతో మూలుగుతున్నాడు.

ఇదంతా కళ్ళారా చూస్తూకూడా మిత్ర విందకుడు ఆ మనిషి ఆ నగరానికి రాజని భ్రమపడ్డాడు. అసిధారాచక్రం మిత్రవింద కుడి కళ్లకు పద్మంలాగా కనబడింది; అతని వంటిమీద గొలుసు అలంకార భూషలలాగా తోచింది; అతని మూలుగు గంధర్వగానంలాగా వినిపించింది.

మిత్రవిందకుడు ఆ నరకవాసిని సమీ పించి, "అయ్యా, తమరు చాలాకాలంగా ఆ పద్మాన్ని శిరస్సున ధరించారు. నన్ను కూడా ధరించనివ్వండి!" అని అడిగాడు.



"బాబూ, ఇది పద్మం కాదు, అసిధారా చక్రం!" అన్నాడు నరకవాసి.

"చూశావా? నా కివ్వటం ఇష్టంలేక ఆ మాట అంటున్నావు!" అన్నాడు మిత్రవిందకుడు.

"నేటితో నా పాపానికి పరిహారం అయిపోయి నట్టుంది. వీడుకూడా నాలాగే తల్లిని కొట్టినవాడై ఉంటాడు. పాపఫలం అనుభవించటానికే వీడిక్కడికి చేరివుంటాడు!" అని తన మనస్సులో అనుకుని నరకవాసి తన నెత్తిమీద ఉన్న అసిధారాచక్రాన్ని మిత్రవిందకుడి నెత్తిన పెట్టి, సంతోషంగా తన దారిన తాను వెళ్ళిపోయాడు.

స్వర్గంలో ఇంద్రుడుగా ఉంటున్న బోధిసత్వుడు దేవగణాలను వెంటబెట్టుకుని నరకాలన్నిటినీ తణిఖీ చేస్తూ కొంతకాలానికి మిత్రవిందకుడుండే చోటికి వచ్చాడు.

ఆయనను చూడగానే మిత్రవిందకుడు ఏడుస్తూ, "స్వామీ, కరుణించండి! ఈ చక్రంనన్నెప్పుడువదులుతుందో చెప్పండి!" అని వేడుకున్నాడు.

అప్పుడు ఇంద్రుడు, మిత్రవిందకుడికి ఈ విధంగా జవాబు చెప్పాడు:

"నీకు ఎంత డబ్బున్నా ఇంకా కావాలని కోరావు. నీ కోరికలు ఎంతకూ తీరలేదు. నలుగురు పిశాచినులతో, ఎనిమిది మందితో, పదహారుమందితో, ముప్పై ఇద్దరితో కాలక్షేపం చేశావు. మానవుడు నడవదగిన ఉన్నత మార్గాలు నీకు ఏమాత్రమూ నచ్చలేదు. ఇతరులు నీ మేలు కోరి చెప్పిన సలహాకూడా నచ్చక ఈ చక్రాన్ని కోరి నెత్తికి తెచ్చుకున్నావు. నీవు బతికి ఉన్నంత కాలమూ ఆ అసిధారా చక్రం నిన్ను వదలదు."

ఈ విధంగా చెప్పి ఇంద్రుడు తన పరివారంతోసహా వెళ్ళిపోయాడు. మిత్రవిందకుడు తనకు పట్టిన దుర్దశ తెలుసుకుని, విచారంతో కుంగిపోయాడు.






## 4

[పద్మపాదుడు, పింగళుడు భల్లూకపర్వతాలకు బయలుదేరారు. కొంత దూరం ప్రయాణం చేసిన తరవాత, పింగళుడు స్నానం చేసేందుకు, ఒక కొలనుదగ్గిరకు వెళ్ళాడు. అక్కడ, బంధింపబడి వున్న భల్లూకకేతుడనేవాడు, పింగళుణ్ణి సాయంచేయవలసిందిగా అడిగాడు. పింగళుడు అతణ్ణి సమీపించబోయేంతలో, వెనకనుంచి పద్మపాదుడు కేకవేశాడు.]

పద్మపాదుడి కేక విని, పింగళుడు అదిరి పడి వెనుదిరిగి చూచాడు. అతడి చేతిలోని రాయి జారి కొలనులో పడి శబ్దమైంది.

"పింగళా! అత డెవరనుకుంటున్నావ్?" అంటూ పద్మపాదుడు కఠినంగా ప్రశ్నించాడు. పింగళుడు ఒకసారి భల్లూకకేతుడి కేసి చూసి తల వంచుకున్నాడు.

భల్లూకకేతుడు, పద్మపాదుడికేసి అనుమానంగా చూస్తూ, "స్వామీ, తమరెవరు? పుణ్యకార్యం చెయ్యనున్న, యీ యువకుణ్ణి ఎందుకు వారిస్తున్నారు?" అన్నాడు.

"పుణ్యకార్యమా?" అంటూ పద్మపాదుడు బిగ్గరగా నవ్వి, "నువ్వెవరివైందీ నాకు తెలియందికాదు. నిన్ను గురించి సర్వం ఎప్పుడో తెలుసుకున్నాను," అన్నాడు.

భల్లూకకేతుడు జవాబు చెప్పబోయేంతలో, పింగళుడు అందుకుని, "ఇతడి పేరు భల్లూకకేతుడు. మనం వెళుతున్న భల్లూక పర్వతాలకు ఒకప్పుడు, యితడు అధిపతి అట. ఒకానొక మాంత్రికుడి కారణంగా, తనకీ దురవస్థ పట్టిందని చెప్పాడు," అన్నాడు.





"అవును, ఒకానొక మాంత్రికుడివల్లనే, యితడికి యీ దుస్థితి కలిగింది. ఆ మాంత్రికు డెవరో నువ్వెరుగుదువా, పింగళా ?" అని అడిగాడు పద్మపాదుడు. తెలియదన్నట్టు పింగళుడు తల వూపుతూ, భల్లూకకేతుడికేసి చూశాడు.

"ఈ భల్లూకకేతుణ్ణి పట్టి యిక్కడ రాతికి కట్టి, బంధించిన వాడు మహా మాయుడు!" అంటూ పద్మపాదుడు, భల్లూకకేతుడికేసి తీక్షణంగా చూశాడు.

భల్లూకకేతుడు, ఆ మాట వింటూనే పళ్ళు పటపట కొరికి, "నువ్వెవరు? నా సంగతి నీ కెలా తెలుసు? ఆ మహా మాయుడి వృత్తాంతం నీ కెవరు చెప్పారు? నీవూ మరో మాంత్రికుడివి కాదుగదా ?" అన్నాడు తీవ్రంగా.

"అవును, నేనూ మాంత్రికుణ్ణే! నా పేరు పద్మపాదుడు. మహా బలశాలివీ, జిత్తులమారివీ అయిన నిన్ను జయించి, యిక్కడ కొండరాతికి బంధించిన, ఆ మహా మాయుడి సమాధిమీదకు నేను దాడి వెళుతున్నాను," అన్నాడు పద్మపాదుడు.

"నిజమా? మహామాయుడి సమాధి మీదికే దాడి వెళుతున్నారా? అదే నిజమైతే, స్వామీ, మీరూ మహామంత్రవేత్తలయి వుంటారు. మహామాయుడికి బద్ధశత్రువునైన నా సాయం మీకు చాలా వుపకరిస్తుంది. నన్ను బంధవిముక్తుణ్ణి చేయండి. మీకు ఎల్లకాలం దాసుడుగా వుంటాను," అన్నాడు భల్లూకకేతుడు.

"నీ కల్లబొల్లిమాటలు నమ్మేందుకు నేను అమాయకుణ్ణి కాదు," అన్నాడు పద్మపాదుడు నవ్వుతూ.

పింగళుడు, పద్మపాదుడి దగ్గిరకువస్తూ, "పద్మపాదా, యితణ్ణి మనం రక్షించ వచ్చనుకుంటాను. అడిన మాట తప్పితే, తల పగిలిపోతుందని, అతడి కెవరో శాపం పెట్టినట్టు చెప్పాడు," అన్నాడు.





"అ మాట నమ్మి, నువు ప్రమాదంలో చిక్కుకునేందుకు సిద్ధమయావు. మహామాయుడిదగ్గిర వున్న మంత్రశక్తి గల వస్తువులు మనవికానిదే, యీ భల్లూకకేతుణ్ణి మనం విడిపించటం ప్రమాదమవుతుంది. ముందు అ వస్తువులను మనవిగా చేసుకున్న తరవాత, యితణ్ణి మన దాసుడుగా చేసుకోవచ్చు," అన్నాడు పద్మపాదుడు.

"అయితే, స్వామీ..." అంటూ భల్లూకకేతుడు, ఏమో చెప్పబోయేంతలో, పద్మపాదుడు అతణ్ణి వారిస్తూ, "భల్లూకా! నీ మెరమెచ్చుమాటలు నన్ను మోసపుచ్చలేవు. మహామాయుడు సమాధి అయిన పాడుదేవళంలో నేను ప్రవేశించిన తరవాత, నిన్ను బంధవిముక్తుణ్ణి చేస్తాను. అంతవరకూ, నీవు యిక్కడ వుండవలసిందే!" అంటూ వెనుదిరిగాడు. పింగళుడుకూడా, అతడి వెనకనే బయులుదేరాడు.

పద్మపాదుడూ, పింగళుడూ అడవి నుంచి బయటికి వచ్చారు. ఎదురుగా వున్న పచ్చికబయలులో, వారికి వాహనాలుగా వుపయోగించిన గాడిదలు లేవు. పింగళుడు ఆశ్చర్యపోతూ చుట్టూచూచి, "మన పిశాచ వాహనా లెక్కడ? అవి, యీ ప్రాంతాల మేస్తున్నవనుకున్నాను," అన్నాడు.



"అవి గాడిదల రూపంలో వున్న పిశాచాలుగాని, గాడిదలు కావు గదా? అలాంటప్పుడు, వాటికి ఆహారంగా పచ్చిక ఎలా పనికివస్తుంది? అవి రెండూ ఆహారసంపాదనకు వెళ్ళినై. ఇక, మన ఆహారం సంగతి!" అంటూ పద్మపాదుడు పొట్ట తడువుకుంటూ, అక్కడ మెత్తని కంబళీలా వున్న పచ్చికమీద కూలబడ్డాడు.

పింగళుడు కూడా అతడి పక్కనే కూర్చుంటూ, "అవును, పద్మపాదా! నాకూ ఆకలేస్తున్నది. మనం ఆహారం వెంట తెచ్చుకోవటం మరిచిపోయాం," అన్నాడు గాభరాపడుతూ.



పద్మపాదుడు, పింగళుడి వాలకంచూచి నవ్వి, "పింగళా, అక్కడ వున్న సంచీ అందుకో" అంటూ కొంచెం ఎడంగా వున్న సంచీకేసి చేయి చూపాడు.

పింగళుడు సంచీ తీసుకుని, అందులో ఆహారపదార్థాలు వున్నవేమో అని చేయి పెట్టి వెతికి, ఏమీ లేకపోవటం తెలుసుకుని, నిరాశపడ్డాడు. పద్మపాదుడు, సంచీని అందుకుని, "పింగళా, నీ కెలాంటి భోజనం కావాలి ? ఎన్ని రకాల కూరలు ? కోరుకో!" అని అడిగాడు నవ్వుతూ.

"ఎన్నిరకాల కూరలోకూడానా ? కాలే కడుపుకు, యిన్ని పచ్చడి మెతుకులు



చాలు. ఆ సంచిలో ఏమీలేదు. వట్టి కాళీ సంచీ!" అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు సంచీ తెరిచి, అందులోకి ఓ మారు తొంగిచూచి, మెల్లగా ఏదో మంత్రం జపించి, "పింగళా, సంచీలో యిప్పుడు చూడు!" అంటూ సంచీని పింగళుడి ముందుపెట్టాడు.

పింగళుడు ఆత్రంగా సంచీలో చేయి పెట్టాడు. అతడి చేతికి వేడివేడిగా వున్న ఒక వెండిపాత్ర తగిలింది. అది బయటికి తీశాడు. అందులో కళకెళలాడుతూన్న అన్నం వుంది. అతడు ఆశ్చర్యపోతూ పద్మపాదుడికేసి చూశాడు.

పద్మపాదుడు నవ్వి, "నీకు కావలసిన అన్ని రకాలకూరలూ, పాయసాలూకూడా ఆ సంచీలో వున్నవి. త్వరత్వరగా బయటికి లాగు," అన్నాడు.

పది నిమిషాలు గడిచీ గడవకముందే, పింగళుడు సంచీలోనుంచి ఇరవైఅయిదు రకాల కూరలూ, పాయసాలూ బయటికి లాగాడు. బాగా ఆకలిగొనివున్న పద్మపాదుడూ, పింగళుడూ కలిసి త్వరలోనే భోజనం ముగించారు. తరవాత కొంచెం సేపు విశ్రాంతి తీసుకుని తిరిగీ ప్రయాణానికి సిద్ధమయారు.





పద్మపాదుడు చిటికెడు మన్నుతీసుకుని మంత్రించి, భూమిమీద చల్లగానే పెళపెళ మంటూ భూమి బద్దలయింది. గాడిదల రూపంలో వున్న రెండు పిశాచాలూ, భీక రంగా ఓండ్రిస్తూ పైకి వచ్చినై. పద్మ పాదుడూ, పింగళుడూ చెరిఒక వాహనాన్ని ఎక్కి భల్లూకపర్వతాలకేసి బయలుదేరారు.

రెండు మూడు గంటల ప్రయాణం తరవాత, భూమ్యాకాశాలు ఒరుసుకునే చోట, నల్లని పొగలు కమ్ముతున్నట్టుగా ఒక దృశ్యం కనిపించింది. పింగళుడు, అటు కేసి చూపుతూ, "పద్మపాదా! ఆ కనబడేవి మబ్బులా లేక పొగలా?" అని అడిగాడు.

పద్మపాదుడు కొంచెంసేపు అటువైపు పరీక్షగా చూచి, "పింగళా, అవి మబ్బులూ కాదు, పొగలూ కాదు. భల్లూకపర్వతాలు వున్న ప్రదేశంలో, వాటిని కాపలా కాస్తున్న రాక్షసగణం! బహుశా, అవి మన రాకను గమనించి, మనను భయపెట్టేందుకు ప్రయత్నిస్తున్న వనుకుంటాను," అన్నాడు.

పద్మపాదుడు మాట ముగించీ ముగించకముందే, ఎదురుగా, దాదాపు ఓ యాభై గజాల దూరంలో, మేఘంలాంటి నల్లని పొగ భూమిమీంచి గుండ్రంగా సుడులు తిరుగుతూ, తాటిచెట్టు ప్రమాణంలో పైకి



లేచింది. పింగళుడు భయంతో వణికి పోతూ, పద్మపాదుడికేసి చూశాడు. పద్మ పాదుడు ఏదో మంత్రోచ్చారణ చేసి, తను ఎక్కివున్న గాడిదను, అటుకేసి పరిగెత్తించాడు. మరుక్షణాన పొగ మాయమైంది.

పద్మపాదుడు, పింగళుడికేసి తిరిగి, "పింగళా, భయపడకు! ఇదిగో, నీకు రక్షణగా, యీ కత్తి యిస్తున్నాను. దీనితో నీవు ఏ రూపంలో నిన్ను ఎదిరించవచ్చిన రాక్షసినైనాసరే సంహరించవచ్చు," అంటూ పింగళుడికి కత్తిని యిచ్చేంతలో, వారిద్దరి మధ్య వున్న భూమి దద్దరిల్లింది. పద్మ పాదుడూ, పింగళుడూ ఎక్కివున్న గాడి



దలు రెండూ పక్కలకు పారిపోయినై. మరు క్షణంలో, బారెడేసి దంతాలతో, శరీరమంతా జడలతో అలుముకునివున్న ఏనుగు ఒకటి, ఘీంకరిస్తూ పింగళుడి మీదికి లంఘించింది. పింగళుడు వెనుకాడక, నిర్భయంగా తన చేతికత్తితో ఏనుగుమీదికి దూకాడు. వెంటనే ఏనుగు బాధతో మూలిగినట్టుగా శబ్దంచేసి, క్షణంలో నల్లని పొగగా మారి, సుడులు తిరుగుతూ దూరంగా పారిపోయింది.

"భేష్, పింగళా, అదీ యువకుడైనవాడు ప్రవర్తించవలసిన తీరు! దెబ్బకు దెయ్యం పారిపోతుందనే సామెత కల్లగాదు. నీకు, యిచ్చిన కత్తిలో ఏ మంత్రశక్తీ లేదు. కాని, ముందుగా ఆ మాట చెప్పినట్లయితే. నువ్వు అంత ధైర్యంగా ఆ మాయాగజాన్ని ఎదిరించేవాడివి కాదు. ఇప్పుడు తెలిసిందా; ధైర్యవంతుణ్ణి ఎవరూ లొంగతీసుకోలేరన్న సంగతి!" అన్నాడు పద్మపాదుడు.

పింగళుడు తన చేతనున్న కత్తికేసి ఓమారు ఆశ్చర్యంగా చూసి, పొట్టచెక్కలయేలా నవ్వుతూ, "యీ కత్తిలో నిజంగా మంత్రశక్తి లేదా? అయినా ఫరవాలేదు. దీనితో నేను వెయ్యిమంది రాక్షసులనైనా సరే ఎదిరించగలను. జై, పాతాళభూతా!" అంటూ కత్తిని గాలిలో గిరగిరా తిప్పాడు.



పింగళుడు ప్రదర్శించిన ధైర్యసాహసాలు పద్మపాదుణ్ణి ఎంతగానో ఆకర్షించినై. అతడు పింగళుడికేసి ఆప్యాయంగా చూసి, "పింగళా, మనం భల్లూకపర్వతాలను సమీపించాం. మనం చేరవలసిన నది, యీపర్వతాల మధ్య గల లోయలో వుంది. కాలి నడకను, అక్కడికి చేరాలంటే చాలాకాలం పడుతుంది. ఎక్కే రాయీ దిగే రాయీ— చాలా శ్రమతో కూడిన పని. కనుక, యీ పిశాచగార్దభాలను కొండలమీదుగా ఎగిరించి, ఆ లోయలో దిగుదాం!" అన్నాడు.

పింగళుడు అంగీకార సూచకంగా తలవూపేంతలో గాడిదలు రెండూ, గాలిలోకి లేచినై. అవి కొండశిఖరాలమీదుగా ఎగురుతూ, క్రమంగా లోయలో గల నది సమీపాన దిగినై. పద్మపాదుడూ, పింగళుడూ తమతమ వాహనాలమీంచి దిగారు. మరుక్షణంలో అవి రెండూ మాయమైపోయినై.

పద్మపాదుడు నది ఒడ్డునే కూర్చుని, చేతితో నీళ్లను కదిలిస్తూ మంత్రం పఠించసాగాడు. క్రమంగా నదిలో అలలు పుట్టి ఉవ్వెత్తుగా లేస్తూ పొగలు చిమ్మసాగినై. పింగళుడు స్థాణువులా ఆ దృశ్యం చూస్తూ కదలామెదలక వుండిపోయాడు.

కొద్దిసేపటి తరవాత పద్మపాదుడు యివతలికి వచ్చి, సంచీలో వున్న గాజుజాడీని

తీసుకురావలసిందిగా పింగళుడితో చెప్పాడు. పింగళుడు గాజుజాడీ తెచ్చి, పద్మపాదుడి ముందు పెట్టాడు. అందులో మొసళ్ల రూపంలోవున్న మహామాయుడి శిష్యులిద్దరి కేసీ పద్మపాదుడు గుడ్లురుముతూ చూచి, "ఇకనైనా మీరు, మీ అసలు రూపాలు ధరిస్తారా ? లేక కాల్చి బూడిదచేసి, యీ నదిలో కలపమంటారా ?" అంటూ హుంకరించాడు. వెంటనే గాజుజాడీ ఠపీమంటూ పగిలి ముక్కలుచెక్కలుగా గాలిలోకి ఎగిరిపోయింది. నల్లని వికృతాకారులైన యిద్దరు వ్యక్తులు పద్మపాదుడుకి నమస్కరిస్తూ, "మహామాంత్రికా! మేము మీకు దాసానదాసులం! ఏమిటీ సెలవు ?" అని అడిగారు.

"మహామాయుడి సమాధి వున్న పాడు దేవళంలోనికి ప్రవేశం కావాలి. ముందుగా యీ నదిలోని నీరు యింకి పోయేట్టు, చేయండి !" అంటూ పద్మపాదుడు కఠినంగా జవాబిచ్చాడు.

మహామాయుడి శిష్యులు ముఖముఖాలు చూచుకుని, జవాబు చెప్పేందుకు తటపటాయిస్తున్నంతలో, పద్మపాదుడు కళ్ళెర్రచేసి, "నా ఆజ్ఞ విన్నారా లేదా ?' అని ప్రశ్నించాడు.

మహామాయుడి శిష్యులు వణికిపోతూ, పద్మపాదుడికి నమస్కరించి, "ఈ నది యింకిపోవాలన్నా, మహామాయుడి సమాధి వున్న పాడుదేవళంలోకి ప్రవేశించాలన్నా, ముందుగా పింగళుడనే జాలరి యువకుడు యిక్కడికి రావలసి వుంటుంది," అన్నారు.

"అదుగో, యితడే ఆ జాలరి, పింగళుడు !" అంటూ పద్మపాదుడు, పింగళుడి కేసి చేయివూపాడు.

మహామాయుడి శిష్యులు, పింగళుడి కేసి ఆశ్చర్యంగా చూసి, "మహాప్రసాదం! మీ ఆజ్ఞ యిప్పుడే నెరవేరుస్తాం !" అంటూ వెంటనే అదృశ్యులై పోయారు.

(ఇంకా వుంది)



# స్వర్ణకారుడు



విక్రమార్కుడు పట్టుదలతో చెట్టువద్దకు తిరిగి వెళ్లి, శవాన్ని దించి భుజాన వేసుకుని, శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలో వున్న బేతాళుడు, "రాజా, నీవు మరొకరికోసం ఇంతగా పాటుబడుతున్నావు. కాని ఈ ప్రపంచంలో కృతజ్ఞత చాలా అరుదు. మనవల్ల కొంచెం పొరపాటు జరిగితే మనద్వారా బాగుపడినవాళ్ళే మనకు గర్భశత్రువు లవుతారు. ఇందుకు ఉదాహరణగా నీకు లోహితుడి కథ చెబుతాను విను!" అంటూ ఈ కింది కథ చెప్పాడు:

వలభీపురం వాణిజ్యానికి ప్రసిద్ధిచెందిన కాలంలో అక్కడ ధర్మగుప్తుడనే ధనికుడుండేవాడు. ఈ ధర్మగుప్తుడు ఎక్కడినుండో వలభీపురానికి చేరినవాడు. అక్కడ అతనికి ఎవరూ లేరు. అతను ఒంటరిగా జీవిస్తూ, అవసరం వచ్చినప్పుడు వ్యాపారస్తులకు అప్పుపెట్టి పెద్ద మొత్తాలు వడ్డీ

రూపాన వారినుంచి పుచ్చుకుంటూ చాలా ధనం గడించాడు.

కాలక్రమాన ధర్మగుప్తుడు ముసలి వాడైపోయాడు. అయనదగ్గిర అయిదారు లక్షల విలవచేసే బంగారమూ, వెండీ చేరింది. తన బొందెలో ఊపిరి ఉండగా ధర్మగుప్తుడు తన సొత్తు ఇతరులకు చిన్న మెత్తుకూడా ఇవ్వదలచలేదు. ఇచ్చేటందు కాయనకు వలభీపురంలో బంధు మిత్రు లెవరూ లేరుకూడా.

ఒకనాటి సాయంకాలం చీకటి పడేవేళ ధర్మగుప్తుడు పారుగూరునుంచి ఇంటికి వచ్చే దారిలో ఆయనను దొంగలు కొట్టారు. తలమీద బలమైన గాయం తగిలి ఆయన పడిపోయాడు. కాని దొంగలకు ఆయనవద్ద ఏమీ దొరకలేదు.

దొంగలు వెళ్ళిపోయాక ధర్మగుప్తుడికి స్పృహ వచ్చింది. ఆయన మెల్లిగా నడుచు కుంటూ వలభీపురం శివారు చేరేసరికి అర్ధ రాత్రి కావస్తున్నది. ఊరిబయట ఒక ఇంటి వాకిలి తెరిచి ఉన్నది. అక్కడ ఒక మనిషి నిలబడివున్నాడు.

"బాబూ, చంపేశారు!" అంటూ ధర్మ గుప్తుడు ఆ మనిషికేసి వెళ్ళాడు.

అర్ధరాత్రివేళ చల్లగాలికి తలవాకిట నిల బడి ఉండిన మనిషి ఒక స్వర్ణకారుడు.



అతని పేరు లోహితుడు. లోహితుడు నగలు చేసి కాస్తోకూస్తో సంపాదించినా దాన్నంతా పరుసవేదికోసం ఖర్చు చేసేసుకున్నాడు. సత్తును వెండిగా మార్చాలనీ, ఇత్తడిని బంగారంగా మార్చాలనీ లోహితుడి ఆశ. ఇందుకై అతను రకరకాల మూలికలను అడవులనుంచీ, కొండలనుంచీ తెచ్చి, రాత్రింబగళ్ళు పుటాలువేసి అంతులేని శరీరశ్రమపడ్డాడు.

లోహితుడి మామగారు చావుబతుకుల్లో ఉన్నాడని తెలిసి లోహితుడి భార్య తన పిల్లలతోసహా పుట్టింటికి వెళ్ళింది. లోహితుడు రోజల్లా కొలిమిదగ్గిరే ఉండి, చల్లగాలి కోసం అంతకు ముందే బయటికి వచ్చాడు. తనకేసి వచ్చిన ధర్మగుప్తుణ్ణి మొదట లోహితుడు గుర్తించలేదు. అయినా అతను ముందుకు వచ్చి ముసలివాణ్ణి పట్టుకుని లోపలికి తీసుకువెళ్లాడు. కొలిమి మంటల్లో అతనికి ధర్మగుప్తుడి ఆనవాలు తెలిసింది. "మీరా, బాబూ? ఏమిటిది?" అన్నాడు.

"దొంగలు....తల పగలగొట్టారు!" అంటూ ధర్మగుప్తుడు ప్రాణాలు వదిలాడు.

తాను ఇప్పుడు ఏం చెయ్యాలో లోహితుడికి తెలియలేదు. చుట్టుపక్కలవాళ్లను లేపుకువద్దామనుకున్నాడు. అందరూ చేరి "నీవే డబ్బుకోసం ముసలాణ్ణి చంపి







లోహితుడికి తన భార్యపైనా, పిల్లల పైనా ప్రేమ జాస్తి. వాళ్ళు సుఖపడటందు లకే అతను బంగారం చేసే పిచ్చిలో పడి పోయాడు. ఇప్పుడుకూడా అతను వాళ్ళ సుఖంకోసమే ధర్మగుప్తుడి సొమ్ము కాజేయ నిశ్చయించాడు.

శవాన్ని వెతికితే తాళపుచెవుల గుత్తి దొరికింది. లోహితుడు వాటిని తీసుకుని నేరుగా ధర్మగుప్తుడి ఇంటికి వెళ్ళాడు. తలుపు తెరిచి లోపల ప్రవేశించాడు. ఇనప పెట్టెలో లక్షలుచేసే వెండీ, బంగారమూ ఉన్నది. అదంతా ఒక గోతంలో వేసుకుని, ఇనపపెట్టె మూసి, ఇంటికి తాళం వేసి లోహితుడు తన ఇంటికి తిరిగి వచ్చాడు.

వుంటావు!" అంటారేమోనని భయం వేసింది. ధర్మగుప్తుడు చావనే చచ్చాడు. అతని కిప్పుడు ఎవరూ చేయగల సహాయం ఏమీలేదు. ఆయన తన ఇంటోకి రావటం ఈ అర్ధరాత్రివేళ చూసినవారు లేరు. అందు చేత తాను ఈ బెడద వదిలించుకోవటం మంచిదనుకున్నాడు లోహితుడు.

ఇంతలో మరొక ఆలోచన తట్టింది. ధర్మగుప్తుడుదగ్గిర చాలా ధనం ఉన్నట్టు చెప్పుకుంటారు. ఆయనకు వారసులెవరూ లేరు, ఆ సొమ్మంతా రాజుగారి ధనాగారం చేరవలిసిందే. కావలిస్తే ఆ సొమ్ము తానే తీసుకోవచ్చు.

తెల్లవారేలోపుగా లోహితుడు వెండి బంగారాలను అటకమీద పెట్టి, పిడకలు కప్పి, ధర్మగుప్తుడి శవాన్ని తాళపుచెవులతో సహా దొడ్లో నిలువు లోతున పాతేసి, గొయ్యి పూడ్చేశాడు.

రెండు మూడు రోజులపాటు ధర్మ గుప్తుడి సంగతి విచారించినవారు లేరు. తరవాత ఆయననుగురించి ఆరా తీయటం ఆరంభమయింది. ఆయన పొద్దూకు మాటున పొరుగూరునుంచి బయలుదేరటం చూసినవారున్నారుగాని ఆయన వలభీకి





తిరిగి రావటం చూసినవారు లేరు. మధ్య దారిలో ఎక్కడో ఆయన చనిపోయి వుంటాడని జనం నిర్ధారణ చేసుకున్నారు. రాజుగారి అధికారులు వచ్చి ధర్మగుప్తుడి ఇంటి తాళం పగలగొట్టి ఇల్లంతా పరీక్షించి ఉన్న ఆస్తి స్వాధీనం చేసుకున్నారు. ఈ ఆస్తి చాలా కొద్దిగా ఉండటం చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు. కాని ఇంట్లో దొంగలు పడిన లక్షణాలు లేవు.

త్వరలోనే ధర్మగుప్తుణ్ణి గురించి జనం చెప్పుకోవటం మానేశారు. ఇక తనకేమీ భయం లేదనుకున్నాడు లోహితుడు. పుట్టింటినుంచి అతని భార్య పిల్లలతోసహా తిరిగి వచ్చింది.

లోహితుడు తన భార్యతో, "ఏమే, కాశీలో ఒక సిద్ధుడున్నాడనీ, ఆయనకు పరుసవేది వచ్చుననీ తెలిసింది. నేను కాశీకి వెళ్లి ఆరు నెలల్లోగా తిరిగి వచ్చి నీకూ, పిల్లలకూ బంగారు తొడుగులు చేయిస్తాను!" అన్నాడు.

లోహితుడి భార్యకు తన భర్త అంటే ప్రాణం. "బంగారం లేకపోతే మానె! మీరు బంగారు పని చేసుకుని నాలుగు డబ్బులు సంపాదించుతూ ఇంటిపట్టున ఉండండి. మాకదే పదివేలు! ఎక్కడి కాశీప్రయాణం, నేను పోనివ్వను!" అని శోకాలు పెట్టింది.

లోహితుడు తప్పనిసరిగా తన భార్యతో నిజం చెప్పెయ్యవలిసి వచ్చింది. అతను ఆమెకు జరిగినదంతా పూసగుచ్చినట్టుచెప్పి, అటకమీద పిడకలకింద దాచిన వెండి బంగారాలు చూపాడు.

"ఏదో ఒక నాటకం ఆడకపోతే మనం ఈ సొమ్ము అనుభవించటానికి లేదు. అందుచేత నన్ను ఆరు నెలలపాటు ఎటైనా వెళ్లి రానీ! ఆ తరవాత మహారాజుల్లాగా బతుకుదాం!" అన్నాడు లోహితుడు తన భార్యతో. ఆమె సరే నన్నది.

ఎవరికీ అనుమానం కలగకుండా ఉండ గలందులకు లోహితుడు తాను ఎగిరిన వారి దగ్గిర దారిఖర్చుకు అప్పుతీసుకుని, కాశీకి వెళుతున్నానని బయలుదేరి వెళ్ళాడు. అయన తిరిగివచ్చేదాకా భార్యా, పిల్లలూ చాలా పేదగా బతికారు. ఆరు నెలల అనం తరం ఒక అర్ధరాత్రి లోహితుడు ఇంటికి చేరి, అటకమీదినుంచి వెండి బంగారాలు దించాడు. మర్నాడు తానెరిగిన వారందరినీ పిలిచి వారికి తన సొత్తంతా చూపించి, "కాశీలో సిద్ధుడి దయవల్ల ఈ వెండి బంగా రాలు దొరికాయి. నా జీవితం, నా పిల్లల జీవితం సుఖంగా వెళ్ళిపోతుంది!" అన్నాడు.

అందరూ లోహితుణ్ణి అభినందించారు. అతడి జీవితం సుఖంగా వెళ్ళిపోతున్నది.

రాజుగారి కొలువులో ఉండే ఒక పెద్ద ఉద్యోగికి లోహితుడి ఆస్తిపై దురాశ పుట్టింది. ఈ ఉద్యోగికి అందగత్తె అయిన కూతురున్నది. ఆ పిల్లను లోహితుడి కిచ్చి చేసి, లోహితుడి మొదటి భార్యనూ పిల్ల లనూ వెళ్ళగొట్టించటానికి అయన ఎత్తు వేశాడు. లోహితుణ్ణి తన ఇంటికి పిలిపించి తన కుమార్తెను చూపించి, "ఈ పిల్లకు పెళ్ళి కావాలి. నిన్ను తప్ప చేసుకోనంటు న్నది," అన్నాడు. లోహితుడు పెళ్ళికి సమ్మతించాడు. రేపు పెళ్ళి అనగా లోహితుడి



భార్యకు, తన భర్త ఇంకో పెళ్లి చేసుకోబోతున్నాడని తెలిసింది. ఆమె భర్తఎదట ఏడిచి, ఈ పెళ్లి జరగటానికి వీల్లేదన్నది.

"నీకు వచ్చిన లోటేమిటి? అన్ని వీర్పాట్లూ అయాక పెళ్లి ఎట్లా ఆగుతుంది? నన్ను వేధించకు!" అన్నాడు లోహితుడు.

తనను ప్రాణంకన్న ఎక్కువగా చూసుకునే భర్తకు తనమీద ప్రేమ పోయిందనుకుని లోహితుడి భార్యకు మతిపోయింది. ఆమె ముందు వెనకలు ఏమీ ఆలోచించకుండా అప్పటికప్పుడే మంత్రిగారివద్దకు వెళ్లి, "అయ్యా, కొంతకాలంక్రితం నాభర్త ధర్మగుప్తుడనే ధనికుణ్ణి చంపి ఆయన ఆస్తంతా కాజేశాడు. ధర్మగుప్తుడి శవం మా దొడ్లోనే పాతేశాడు. కావలిస్తే తవ్వి పైకి తీయవచ్చు!" అన్నది.

వెంటనే మంత్రిగారు రాజభటులను పంపి లోహితుడి దొడ్డిలో తవ్వించగా ధర్మగుప్తుడి శవం దొరికింది. న్యాయస్థానంలో లోహితుడు జరిగినదంతా చెప్పాడు. కాని ఎవరూ నమ్మలేదు. లోహితుణ్ణి కొరత వెయ్యమని రాజుగారు ఉత్తరువిచ్చారు.

లోహితుడి ఆస్తంతా రాజుగారి పరమయింది. లోహితుడు కొరతమీద చచ్చాడు. పశ్చాత్తాపంతో లోహితుడి భార్య తన భర్త శవంతోబాటు చితిపైన కాలిపోయింది.





బేతాళుడీ కథ చెప్పి, "రాజా, లోహితుడి కుటుంబం సర్వనాశనం కావటానికి కారకు లెవరు? తన భర్త ఇంకొకతెను పెళ్ళాడబోతున్నాడన్న అసూయతో భర్త మీద నేరారోపణ చేసిన లోహితుడి భార్యా? ధర్మగుప్తుడి ధనాన్ని అపహరించిన లోహితుడా? అతను హత్య చేయలేదన్న సంగతి గ్రహించక లోహితుణ్ణి కొరతవేసిన రాజా? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది!" అన్నాడు.

"లోహితుడి కుటుంబం సర్వనాశనం కావటానికి కారకురాలు లోహితుడి భార్య కాదు. భర్తమీద ప్రేమ ఉండబట్టే ఆమెకు అంత అసూయ కలిగింది. తన భర్త మళ్లీ పెళ్ళాడకుండా చెయ్యటానికి తాను చెయ్యగల ఒక్క పనీ ఆమె చేసేసింది. తరవాత కూడా ఆమె భర్తతోపాటు సహగమనం చేసిందేగాని, భర్త పోయినందుకు సంతృప్తి పడలేదు. లోహితుడి తప్పుకూడా ఏమీ లేదు. అతను ధర్మగుప్తుడి సొమ్ము దొంగిలించిన మాట నిజమేగాని, అతను దొంగతనం చేసేసరికి ధర్మగుప్తుడు చచ్చిపోయాడు. ఆ సొత్తుకు వారసు లెవరూ లేరు. మరికొంచెంసేపు బతికిఉంటే ధర్మగుప్తుడే అతనికి ఆ సొత్తు ఇచ్చేవాడేమో! రాజుగారి తప్పుకూడా ఏమీలేదు. కనిపించిన సాక్ష్యాన్నిబట్టి లోహితుడే ధర్మగుప్తుణ్ణి చంపాడనుకోవటానికి వీలున్నది. పోతే, లోహితుడి కుటుంబం సర్వనాశనం కావటానికి నిజమైన కారణం డబ్బు! ఆ డబ్బే ధర్మగుప్తుడి ప్రాణాన్ని తీసింది, అదే లోహితుడికి రెండో పెళ్లి ఆశ కల్పించి, లోహితుడి భార్యకు మతి పోగొట్టి, చివరకు సర్వనాశం తెచ్చి పెట్టింది," అన్నాడు విక్రమార్కుడు.

ఈ విధంగా రాజుకు మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# ఆవుతో అడావుడి

రాబందును ఏమార్చి పారిపోయి వస్తున్న కుందేలుకు తన ఇంటి సమీపంలో ఆవు అత్త కనిపించింది. ఆవును చూస్తే కుందేలుకు కోపం, ఎందుకంటే కుందేలు ఎన్ని సార్లు అడిగినా ఆవు ఒక్క చుక్క పాలు కూడా ఇచ్చిన పాపాన పోలేదు. మందులోకి కావాలని అడిగినా లేవు పొమ్మన్నది.

"ఏం, అత్తా? ఎలా ఉన్నావు?" అన్నది కుందేలు.

"బాగానే ఉన్నాను, అల్లుడా! నువో?" అన్నది ఆవు.

"ఫరవాలేదు," అంటూ కుందేలు పక్కనే ఉన్న నేరేడుచెట్టు కొమ్మలోకి చూసి, "భలే మంచి నేరేడుపళ్లు! చూస్తే నోరూరుతోంది!" అన్నది.

"ఇంకేం? కోసుకుతిను!" అన్నది ఆవు.

"నేను చెట్టు ఎక్కలేనుగద! ఎవరైనా చెట్టును కదిలిస్తే ఇట్టే రాల్తాయి. నీ తలను చెట్టుబోదెకు ఢీ కొట్టి పళ్లు రాల్చగలవా? నీ వల్లకాదు! అబ్బో, దానికి చాలా బలం ఉండాలి!" అన్నది కుందేలు.

"నన్ను బొత్తిగా తీసేశావే, అల్లుడా! చూసుకో!" అంటూ ఆవు తలవంచి నేరేడు చెట్టుబోదెకు టాకీ ఇచ్చింది. కాని చెట్టు మీద ఉన్నవన్నీ పచ్చికాయలు గనక ఒక్కటీ రాలలేదు.

"నేను చెప్పలా? నీకు బలంచాలదు!" అన్నది కుందేలు.

ఆవుకు రోషంవచ్చింది. అది పది అడుగులు వెనక్కుపోయి అతివేగంగా వచ్చి నేరేడుచెట్టుబోదెను కుమ్మింది. ఆ దెబ్బతో ఆవు కొమ్ములు రెండూ చెట్టుబోదెలోకి దిగబడిపోయాయి.

"అయ్యయ్యో, ఎద్దు మామను సహాయం పిలుచుకొస్తానుండు!" అంటూ కుందేలు ఇంటికి వెళ్లి ఇంటిల్లిపాతినీ పాలచెంబులతో

టి. శంభుదాసు

తీసుకొచ్చింది. చిన్నా పెద్ద కుందేళ్లన్నీ ఆవు పాలు ఆఖరు బొట్టుదాకా పిండుకుని ఇంటికి చక్కా పోయాయి.

ఆవుకు మండి పోతున్నది. అది తెల్లవార్లూ నానా యాతనా పడి తెల్లవారుజామున తన కొమ్ములను చెట్టుబోదెనుంచి బయటికి లాక్కో గలిగింది. తన కింత ఇబ్బంది కలిగించిన కుందేలుకు బుద్ధి చెప్పాలని ఆ ఆవు తన కొమ్ములను మళ్లీ బోదెలోకి వదులుగా దూర్చి కుందేలుకోసం చూడసాగింది.

ఆవు చేసిన ఈ పనిని కుందేలు దూరం నుంచి చూసి, ఏమీ ఎరగనట్టు ఈలవేసుకుంటూ దగ్గిరికివచ్చి, "ఏం, అత్తా? ఈ పాటికి కొమ్ములు వదిలించుకున్నావనుకున్నానే!" అన్నది.

"ఏదీ? నువు కాస్త సహాయంచెయ్యి. తోక పట్టుకులాగు!" అన్నది ఆవు.

"సరే!" అంటూ కుందేలు ఆవు వెనక్కు వెళుతున్నట్టు నటించింది. ఆవు చప్పున కొమ్ములు చెట్టుబోదెనుంచి లాగేసి కుందేలు మీదికి లంఘించింది. కాని అప్పటికే కుందేలు అంతదూరం పరిగెత్తిపోయింది. ఆవు కుందేలును వెంబడించింది.

కుందేలు కొంతదూరం పరిగెత్తి ఒక గోరింట పొదలోదూరి, ఆకుల సందుల్లో నుంచి కళ్లు పెట్టి చూడసాగింది. ఇంతలో ఆవు రొప్పుతూ అక్కడికి వచ్చింది.

"ఆవు అత్తా, ఏమిటి అడావుడి?" అని అడిగింది కుందేలు.

ఆవు కుందేలుకళ్లు మాత్రమే చూసి, లేడి అనుకుని, "నీకా పాపిష్టి కుందేలు కనిపించిందా, లేడి మరదలా?" అన్నది.

"ఇప్పుడే ఈ దారినే కుంటుతూ వెళ్లింది. తరిమి పట్టుకో!" అన్నది కుందేలు.

"పట్టుకోక ఊరుకుంటానా ఏమిటి?" అంటూ ఆవు ముందుకు పరుగుతీసింది. కుందేలు వెల్లికిలా పడుకుని పొట్ట చెక్కలయేట్టు నవ్వసాగింది. (ఇంకా ఉంది)





# వంశ గౌరవం

పూర్వం ఒక దేశంలో ఒక జమీందారుండే వాడు. ఆయనది చాలా ప్రసిద్ధి కెక్కిన వంశం. ఆయన పూర్వీకులు ఇక్ష్వాకుల కాలంలో రాజ్యాలు ఏలారని చెప్పుకునే వాళ్లు. అందుచేత జమీందారుగారు తమ వంశగౌరవంకోసం ఎటువంటి త్యాగమైనా చేయటానికి సిద్ధంగా ఉండేవాడు.

ఈ జమీందారుగారు వెర్రిబాగులవాడు. అస్తమానం తన పెంపుడు కోతితో ఆడు కుంటూ ఉండేవాడు. ఆయనకు ముకుందు డని ఒక్కడే కొడుకుండేవాడు. ఈ ముకుం దుడికి ఒకసారి రాజుగారి కుమార్తెను పెళ్లాడాలని కోరిక కలిగింది. వాడు తండ్రితో ఈ మాట చెప్పి ఆయన సలహాకోరాడు.

"నాయనా, నువు ఏమైనా చెయ్యి, నాకు సమ్మతమే. మన వంశగౌరవానికి మాత్రం కళంకం రానివ్వకు! అంతే నేను కోరేది!" అన్నాడు జమీందారు.

వెంటనే ముకుందుడు రాజుగారివద్దకు వెళ్లి, "మహారాజా, నాకు మీ అమ్మాయిని పెళ్ళాడాలని ఉన్నది! మాది ఎంత గొప్ప వంశమో మీకు తెలుసుకదా! అందుచేత వెంటనే మీ పురోహితుణ్ణి పిలిపించి నా పెళ్లికి ముహూర్తం పెట్టించండి!" అన్నాడు.

రాజుగారు ముకుందుడితో ఏమీ అనక, తన నౌకర్లను పిలిచి, "ఈ శుంఠను మెడ బట్టి బయటికి గెంటండి!" అన్నాడు. రాజ భటులు ముకుందుణ్ణి బయటికి గెంటారు.

ఈ వార్త చెవిని పడగానే జమీందారు గారు కుంగిపోయాడు. ఆయన వంశానికి తీరని అగౌరవం జరిగింది! జమీందారు గారికి అన్నం రుచించలేదు, నిద్ర పట్టలేదు. తన కొడుకు తన కళ్ల పడటానికి వీలులేదని ఆయన తన నౌకర్లతో చెప్పేశాడు. తరవాత ఆయన తన వంశంవారి నందరినీ పిలిపించి జరిగినదంతా చెప్పాడు.

జి. రామచంద్రరావు





"అవును! వంశగౌరవంకోసం ఎవరో ఒకరు ప్రాణం ఒడ్డక తప్పదు!" అన్నారు మిగిలిన బంధువులంతా. ముకుందుడు వెలి అయిపోయి, జమీందారు కాస్తా చచ్చిపోతే ఆయనకున్న ఆస్తి యావత్తూ ఈ బంధువులకే దక్కుతుంది. అందుచేత వాళ్లు ఆ విధంగా చెప్పారు.

జమీందారు కొంచెం ఆలోచించి, "వంశగౌరవంకోసం చచ్చిపోవటానికి నాకైతే అభ్యంతరం లేదుగాని, నా జాతకచక్రం చూసిన జ్యోతిష్కులు నిండు నూరేళ్ల ఆయుర్దాయం ఉందంటున్నారు," అన్నాడు.

"జాతకాలను నమ్మటానికి లేదు. బ్రహ్మ ఎవరికి ఎంత ఆయుస్సు ఇచ్చాడో ఏ జ్యోతిష్కుడూ చెప్పలేడు," అన్నారు బంధువులు.

"సరే, వంశగౌరవానికి నరబలి జరిగి తీరాలంటున్నారు గనక అలాగే జరిగేట్టు చూస్తాను!" అని జమీందారు తన బంధువుల నందరినీ పంపేశాడు.

తరవాత ఆయన తన భార్యవద్దకు వెళ్లి, "ఏమే, మన వంశానికి తీరని కళంకం వచ్చింది. వంశగౌరవంకోసం ఎవరో ఒకరు బలి కాక తప్పదు. నాది చూడబోతే చాలా దీర్ఘాయువుగా కనబడుతున్నది. నాకు బదులుగా నీవు చచ్చిపోయినట్టయితే సౌక

అంతా విని బంధువులు, "ఎంత అవమానం! ఎంత అప్రతిష్ఠ!" అని ముక్కుల మీద వేళ్లు వేసుకున్నారు.

"ఈ అప్రతిష్ఠ నా ఒక్కడిదే కాదు, మీ అందరిదీనూ! అందుచేత దీనికి పరిహారం ఏమిటో మీరంతా బాగా ఆలోచించండి. వంశగౌరవం నిలబెట్టే సాధనం చెప్పండి!" అన్నాడు జమీందారు.

"ముందు ముకుందుణ్ణి ఇంటినుంచి వెళ్ల గొట్టాలి!" అన్నాడొక బంధువు.

"ఆ తరవాత మీరు ప్రాయోపవేశం చెయ్యాలి! ఈ అప్రతిష్ఠకు నరబలి జరిగి తీరాలి!" అన్నాడు మరొక బంధువు.



ర్యంగా ఉంటుంది. ఒక కొడుకును కననే కన్నావు. ముత్తయిదువు చావుకంటె స్త్రీకి కావలిసిందేమిటీ? వంశగౌరవంకోసం చచ్చావంటే నీ కీర్తి శాశ్వతంగా ఉండి పోతుంది. ఏమంటావు?" అని అడిగాడు.

"ఇప్పుడే చావాలా? మరి కొంతకాలం పోనిచ్చి చావగూడదూ?" అన్నది జమీందారు భార్య.

"ఆలస్యం అమృతం విషం అన్నారు. నీవు నిజంగా ఎంతో యోగ్యురాలివి గనక వంశగౌరవంకోసం చచ్చిపోయే భాగ్యం నీకు లభించింది. ఈ పట్టుతాడు తీసుకుని ఈశ్వరుణ్ణి ధ్యానిస్తూ ఉరి వేసుకో!" అని జమీందారు భార్యచేతికి ఒక పట్టుతాడిచ్చాడు.

జమీందారు వెళ్లిపోయాక ఆయన భార్య చాలాసేపు యోచించింది. మతి సరిగాలేని తన భర్త చెప్పాడుగదా అని ఉరి పోసుకు చావటం ఆమె కెంతమాత్రం ఇష్టంలేదు. వంశగౌరవానికి కావలిసింది నరబలేగద. అటువంటప్పుడు ఎవరు బలి అయితే నేం?

ఈ విధంగా ఆలోచించి ఆమె తమ వంటవాణ్ణి పిలిచింది. వంటవాడు వచ్చి, "అమ్మా, ఏం సెలవు?" అన్నాడు.

"నీకొక రహస్యం చెబుతా విను. నాకొక కల వచ్చింది. ఆ కలలో నాకు పార్వతీ



పరమేశ్వరులు కనిపించి, ఇవాళ రాత్రి నేను కనక చచ్చిపోయినట్టయితే నేను వచ్చే జన్మలో చక్రవర్తి భార్యనై పుడతాననీ, ఈ రాత్రే నాతోపాటు చనిపోయేవాడు నాకు భర్త అయి చక్రవర్తి అవుతాడనీ చెప్పింది. కిందటి జన్మలో ఏదో పాపంచేసి ఉండటం వల్ల నాకు మతి సరిగాలేని భర్తదొరికాడు. వచ్చే జన్మలోనైనా నీవంటి తెలివిగలవాడు భర్త కావాలని ఉంది. అందుచేత ఈ పట్టు తాడు తీసుకుపోయి ఉరి వేసుకో! వెనకా ముందూ చూడకు. నేనుకూడా అయిదు నిమిషాల్లో నీవెనకే విషం తాగి చచ్చి పోతాను," అన్నది జమీందారు భార్య.

"చిత్తం, అమ్మగారూ!" అంటూ వంట వాడు వణుకుతున్న చేతులతో పట్టుతాడు అందుకుని, వంటింట్లోకివెళ్ళి ఏమి చెయ్యాలా అనే ఆలోచనలో ఉన్న సమయంలో పక్కనే ఉన్న సామానుగదిలో ఏదో అలికిడి అయింది. వాడు వెళ్లి చూసేసరికి జమీందారు కొడుకు ముకుందుడు బంగారు పాత్రలూ, వెండిపాత్రలూ తీసి ఒక గోతంలో వేస్తూ కనబడ్డాడు.

"తమరా, బాబూ! ఇదేం పని?" అని వంటవాడు గట్టిగా అడిగాడు.

"అరవకు! ఏం జరిగిందో నీకు తెలీదు. నా మూలంగా మా వంశానికి అప్రతిష్ఠ వచ్చింది. నరబలి కావాలి. అందుచేత ఆత్మహత్య చేసుకోబోతున్నాను. ఈ గోతంలో బరువుపెట్టి దాన్ని మెడకు కట్టుకుని నది లోకి ఉరికేస్తాను! నువు గట్టిగా అరిస్తే మావాళ్లు వచ్చి నన్ను ఆపెయ్యగలరు!" అన్నాడు ముకుందుడు.

"అంత శ్రమ దేనికి, బాబూ? ఇదుగో పట్టుతాడు. నిక్షేపంగా దూలానికి ఉరి వేసుకోండి. ఈ బరువంతా నదిదాకా ఎందుకు మోసుకుపోతారు?" అంటూ వంటవాడు ముకుందుడి చేతికి తాడు ఇచ్చాడు.

"భేష్! మంచి సలహా చెప్పావు! నువు చూసి దడుచుకుంటావు, వెళ్లి పడుకో.



నేను దూలానికి ఉరి వేసుకుంటాను!" అన్నాడు ముకుందుడు.

వంటవాడు సామానుగది తలుపుమూసి వెళ్లి పడుకుని నిశ్చింతగా నిద్రపోయాడు.

తెల్లవారింది. జమీందారు నిద్రలేచి తన భార్యగదికి వెళ్లి చూశాడు. ఆమె చచ్చిపోక పోగా హాయిగా నిద్ర పోతున్నది. జమీందారు ఆమెను లేపి, "నువు ఉరి వేసుకోనేలేదా?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"లేదండీ, మన వంటవాడు ఎంత విశ్వాసపాత్రుడనుకున్నారు? మన వంశ గౌరవంకోసం తాను ఉరి వేసుకుంటా నన్నాడు. వాడి రుణం తీర్చుకోలేం!" అన్నది జమీందారు భార్య. కాని వారికి వంటవాడు వంటఇంట్లో పొయిలు రాజేస్తూ నిండు ప్రాణాలతో కనిపించాడు.

"నువ్వింకా బతికే ఉన్నావా?" అన్నది జమీందారు భార్య వంటవాడితో.

"నేనేం చేసేది, అమ్మగారూ? తానే ఉరి వేసుకుంటానని అబ్బాయిగారు పట్టు బట్టి నా చేతినుంచి పట్టుతాడు లాగేసు కున్నారు. నన్ను చావనివ్వమని ఎంతో వేడుకున్నాను, వినలేదు!" అన్నాడు వంట వాడు, విచారంగా ముఖంపెట్టి.

జమీందారు సామానుగదిలోకి అడుగు పెట్టేసరికి దూలంనుంచి తాడున వేళ్ళా



డుతూ ఒక ఆకారం కనిపించింది. అది జమీందారు పెంచే కోతి.

"అది మనవాడేనా? చూడూ!" అన్నాడు జమీందారు భార్యతో.

"చీకటిలో సరిగా కనిపించటంలేదు!" అన్నది ఆయన భార్య.

ఇంతలోనే జమీందారు బంధువులంతా నరబలి జరిగిందో లేదో తెలుసుకునేటందుకు వచ్చారు. జమీందారు వారితో జరిగినదంతా చెప్పి, సామానుగదిలోకి తీసుకుపోయాడు.

చచ్చిన కోతిని దించారు. అది ముకుందుడు కాడేమోనని జమీందారుకు సందేహం వచ్చింది. "కాకపోవటమేమిటి? మూడు మూర్తులా వాడే! మొత్తానికి నీ కొడుకనిపించాడు. వంశగౌరవం నిలబెట్టాడు!" అన్నారు బంధువులంతా, ఏకకంఠంతో. జమీందారు నమ్మాడు.

కోతికి దహన సంస్కారమూ ఉత్తర క్రియలూ జరిపారు. ఏడాది తిరగకముందే జమీందారు పోయాడు. ఆయన ఆస్తిని బంధువులంతా తలా కాస్తా పంచుకున్నారు.

తండ్రి పోయే సమయానికి దూరదేశంలో ఉన్న ముకుందుడు వార్త తెలిసి ఆస్తి స్వాధీన పరుచుకునేటందుకు వచ్చాడు.

వాడు తన బంధువులతో, "నా తండ్రి ఆస్తిని మీరంతా కాజేశారుట. నాది నా పరం చెయ్యండి!" అని అడిగాడు.

"నువ్వెవరవు?" అన్నారు బంధువులు.

"నేను జమీందారు కొడుకు ముకుందుణ్ణి!" అన్నాడు ముకుందుడు.

"ఇంకెక్కడి ముకుందుడు? వాడు పోయి ఏడాది వెళ్లింది. మేమంతా వాడి మైల పట్టాం. వాడు చచ్చినప్పుడు జమీందారుగారి కోతి ఒకటి కనిపించలేదని చెప్పుకున్నారు. అది నువే అయి ఉండవచ్చు. అంతేగాని నువు ముకుందుడివి మాత్రం కాదు! పద, పద!" అని జమీందారు బంధువులు ముకుందుణ్ణి తరిమేశారు.



# నావికుడు సింద్‌బాద్

వాడి శవాన్ని చూస్తుంటే నా మనసుకూ, దేహానికీ కూడా కొత్తబలం వచ్చినట్టయింది. నేను అతివేగంగా సముద్రతీరంకేసి పరిగెత్తాను. అదృష్టవశాత్తూ అక్కడ నాకు కొందరు నావికులూ, తీరాన లంగరు దించి ఉన్న వారి పడవా కనిపించాయి. వారు పళ్లకోసమూ, నీటికోసమూ లంగరువేశారు. వారు నన్ను చూసి ఆశ్చర్యపోతూ చుట్టూ మూగి, ప్రశ్నలవర్షం కురిపించారు. నేను నా అనుభవాలన్నీ చెప్పాను. ముసలివాడు నన్నెట్లా భూతమై పట్టాడో, వాణ్ణి ఎట్లా తుదముట్టించానో చెప్పేసరికి, "అమ్మో, అ ముసలాడినుంచే తప్పించుకున్నావుగా! వాడు ఎందరినో తన కాళ్లతో నొక్కి చంపాడు. తప్పించుకొచ్చిన వాడివి నువ్వొక్కడివే! నీ అదృష్టం మంచిది," అన్నారు వాళ్లు.

వాళ్ళు నన్ను తమ పడవకు చేర్చారు. సరంగు నాకు కట్టుకోను బట్టలిచ్చాడు. ఆయనకూడా నా కథ విన్న తరవాత పడవ కదిలింది.

చాలా రోజులు ప్రయాణంచేసి మేమొక పట్టణం రేవు చేరాం. అది చాలాపెద్దపట్టణమనీ అనేకదేశాల వర్తకులు అక్కడికి వచ్చిపోతూ వుంటారనీ, సరంగు

అయిదవ సముద్రయానం

CHITRA




నాతో చెప్పాడు. ఈ పట్టణం చుట్టూ ఉండే చెట్లపై కొండముచ్చులు జాస్తి అయినందు వల్ల ఈ పట్టణానికి కొండముచ్చుల పట్నం అని పేరు వచ్చిందనికూడా అతడు అన్నాడు.

ఊళ్ళోకి వెళ్లితే ఏదైనా బతుకుతెరువు కనిపిస్తుందేమో ననిపించింది. అందుకని ఒక వర్తకుడితోసహా నేను పడవ దిగి నగరంలోకి బయలుదేరాను. నాకు మంచి స్నేహితుడైన ఆ వర్తకుడు నా చేతికొక సంచీ ఇచ్చి, "ఈ సంచీనిండా గులకరాళ్లు పోసుకుని, నగరద్వారంలోనుంచి మందలు మందలుగా బయటికి వచ్చే జనంతో చేరు. వాళ్లందరూ పట్టణానికి దిగువను వున్న లోయదగ్గిరికి పోతారు. అక్కడ వాళ్ళు ఏం చేస్తే నువ్వూ అదే చెయ్యి. నీకు గిట్టుబాటు కాకపోదు," అన్నాడు.

అతను చెప్పినట్టే నేను సంచీనిండా గులకరాళ్ళు పోసుకున్నాను. నగరద్వారం దగ్గిరికి వెళ్లేటప్పటికి ఒక మంద బయటికి వస్తూ కనిపించారు. అందరి చేతుల్లోనూ నా సంచీలాటివే ఉన్నాయి. నా మిత్రుడు వారికి నన్ను పరిచయం చేస్తూ, "ఇతను పేదవాడు, దూరదేశంవాడు, ఇతనికికూడా బతుకుతెరువు చూపించి పుణ్యం కట్టుకోండి!" అన్నాడు.

కొంతదూరం నడిచి అందరమూ ఒక లోతైన లోయసమీపానికి వచ్చాం. దాని నిండా చాలా ఎత్తయిన చెట్లున్నాయి. వాటిని ఎక్కటానికి మనుష్యమాత్రుడెవడూ సాహసించలేడు. వాటిని కొబ్బరిచెట్లంటారట! వాటి మట్టల్లో కొండముచ్చులూ, కొబ్బరి కాయలూ ఉన్నాయి.

మేమందరమూ చెట్లకింద ఆగాం. మిగిలినవాళ్ళు సంచులు నేలమీద పెట్టి కొండముచ్చులను గులకరాళ్ళతో కొట్టసాగారు. నేనూ అలాగే చేశాను. కొండముచ్చులకు కోపం వచ్చి, కొబ్బరికాయలతో కొట్టసాగాయి. మేమందరమూ ఆ కొబ్బరి

కాయలను ఏరుకుని సంచులలో వేసుకున్నాం. సంచులు నిండగానే వాటిని భుజాలమీద వేసుకుని నగరంలోకి వెళ్ళాం. అక్కడ నా మిత్రుడైన వర్తకుడు నేను తెచ్చిన కాయలను తీసుకుని వాటి ఖరీదు నా కిచ్చేశాడు. ఈ విధంగా నేను రోజూ ఆ లోయకు వెళ్ళి కొబ్బరికాయలు తెచ్చి అమ్మి, కొంత డబ్బు పోగయాక దాన్ని పెట్టుబడిచేసి క్రయవిక్రయాలు చేసి, చిట్ట చివరకు ముత్యాలదీవికి వెళ్ళటానికి కేవుకు సరిపడే మొత్తం సంపాదించాను.

ఈ ప్రయాణంలో నావెంట బోలెడన్ని కొబ్బరికాయలు తీసుకుపోయాను. దారిలోని దీవులలో వాటిని విక్రయించి మిరియాలూ, లవంగపట్టా మారకానికి తీసుకున్నాను. ముత్యాలదీవి చేరే లోపుగా ఈ సరుకంతా లాభసాటిగా అమ్మాను. అక్కడ ముత్యపు చిప్పలు ఏరేవాళ్ళను నియోగించటానికి నాదగ్గిర డబ్బున్నది.

నాకు అదృష్టం బాగా కలిసిరావటంవల్ల నా ముత్యపుచిప్పల్లో మంచి ముత్యాలు దొరికాయి. వాటిని అక్కడ వున్న వర్తకులకు మంచి ధరకు అమ్మాను. ఆ విధంగా త్వరలోనే నేను పెద్ద నిధి సంపాదించగలిగాను. ఇక ఇంటిమీద ధ్యాస పుట్టింది. తిరుగు ప్రయాణానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేసుకున్నాను. ప్రయాణంలో చేరవలసిన రేవుల్లో అమ్మేందుకు సరుకులు కొనటం మంచిదనిపించింది. అందుచేత ఆ దీవులలో విరివిగా దొరికే ముసాంబరం చెక్క కొని, పడవమీద సరుకంతా వేసుకుని, దారిలో విక్రయిస్తూ, బస్రా మీదుగా బాగ్దాద్ చేరుకున్నాను.

నేను తిరిగివచ్చానని నా బంధుమిత్రులంతా సంతోషించారు. నేనుకూడా లాభంతో తిరిగివచ్చాను గనక పేదసాదలకు దానధర్మాలు చేసి, యథాప్రకారం భోగభాగ్యాలలో తులతూగ సాగాను.





# పనికిమాలిన మిత్రులు

ఒక దేశంలో ఒక ధనికుడుండేవాడు. ఆయనకు ఒక్కడే కొడుకు. వాడు పెరిగి పెద్దవాడయాక తండ్రి వాడితో, "నాయనా, జీవితంలో అన్నింటికన్న విలవైనది స్నేహం. డబ్బు సంపాదించవచ్చు, కీర్తి సంపాదించవచ్చు, కాని స్నేహితులను సంపాదించటం చాలా కష్టం. అందుచేత నువు ఎలాగైనా మంచి స్నేహితులను సంపాదించు!" అని సలహాయిచ్చాడు.

అది మొదలు కొడుకు స్నేహితులను పోగుచెయ్యసాగాడు. త్వరలోనే వాడి చుట్టూ అనేకమంది యువకులు చేరారు. వారందరూ వాడితో ఎంతో స్నేహంగా ఉంటూ, తమకున్నదంతా త్యాగంచెయ్యటానికి సిద్ధంగా ఉన్నట్టు కనపడ్డారు.

కొద్దికాలం గడిచాక తండ్రి కొడుకును పిలిచి, "నాయనా, నీకు స్నేహితు లెవరైనా దొరికారా?" అని అడిగాడు.

"దొరికారు, నాన్నా! చాలామంది దొరికారు!" అన్నాడు కొడుకు.

తండ్రి ఆశ్చర్యంతో, "వాళ్లంతా నిజమైన స్నేహితులేనా?" అని అడిగాడు.

కొడుకు కొంచెం ఆలోచించి, "వాళ్లలో నిజమైన స్నేహితులు కనీసం పదిమంది ఉంటారు," అన్నాడు.

"నేను ఇన్నేళ్లు బతికాను గాని నాకున్నదల్లా ఒకటిన్నర స్నేహితులే! ఇంత కొద్దికాలంలోనే నువు పదిమంది నిజమైన స్నేహితులను సంపాదించావంటే నాకు నమ్మశక్యం కాకుండా ఉంది!" అన్నాడు తండ్రి అనుమానంగా.

కొడుకు తన స్నేహితులను వెనకవేసుకు వచ్చి, వాళ్లు తనకోసం ప్రాణాలనైనా ఇచ్చేస్తారని తండ్రితో వాదించాడు.

"ఆ సంగతి సులువుగానే రుజువు చెయ్యవచ్చు!" అన్నాడు తండ్రి. "నువు

టి. రామచంద్రరావు



మాత్రం నేను చెప్పినట్టు చెయ్యి. ఒక పందిని చంపి గోతంలో వేసి భుజాన పెట్టుకుని రహస్యంగా ఒక్కొక్క స్నేహితుడి దగ్గిరికే వెళ్ళు. నువు కోపావేశంలో ఒక మనిషిని చంపినట్టు వారితో చెప్పు. ఈ సంగతి తెలిస్తే నీకు ఉరిశిక్ష తప్పదనీ, నీకు సహాయం చేసినవారినికూడా కొరతవేసే అవకాశం ఉందనీ అను. ఆ తరవాత నిన్ను కాపాడటానికి సహాయపడమని అడుగు, ఏం జరిగేదీ చూస్తాం!"

కొడుకు అలాగే చేశాడు. అతను ఒక చచ్చిన పందిని గోతంలో పెట్టి భుజానవేసుకుని ఒక్కొక్క స్నేహితుడి దగ్గిరికే వెళ్లి తండ్రి చెప్పిన ప్రకారం అన్నాడు. ఒక్కరూ అతనికి సహాయం చెయ్యలేదు.

"ఈ పరిస్థితిలో నేను నీకేమి సహాయం చెయ్యగలను? కొంపతీసి, ఈ శవంతో మా యింటికి వచ్చిన సంగతి మాత్రం ఎక్కడా బయటపెట్టకు. నిన్ను రక్షించలేకపోగా నేను కూడా ఇందులో చిక్కుకోవలసివస్తుంది!" అన్నాడొక స్నేహితుడు.

"నీకోసం కొరతపడటానికి నేను సిద్ధంగానే ఉన్నాను, కాని అందువల్ల నీకేమీ ప్రయోజనం ఉండదు!" అన్నాడు మరొక స్నేహితుడు.

"నీకీ ప్రమాదం రావటం నా కెంతో విచారంగా ఉంది. నిన్ను ఈ జీవితంలో ఎన్నడూ మరిచిపోను," అన్నాడు ఇంకొక స్నేహితుడు.

"నిన్ను అధికారులు ఉరి తీశాక నీ శవాన్ని ఊరేగించి నీ ఉత్తరక్రియలు మహా వైభవంగా జరిపిస్తాం!" అన్నాడు వేరొక స్నేహితుడు.

చేసేదిలేక కొడుకు విచారంగా తండ్రి వద్దకు తిరిగివచ్చి తన స్నేహితులు అన్న మాటలన్నీ చెప్పేశాడు.

అంతా విని తండ్రి తల ఆడించి, "నేను మొదటనే అనుకున్నాను. నాకు జీవితంలో

ఒకటిన్నర స్నేహితులున్నారని చెప్పాను, జ్ఞాపకం ఉన్నదా? వారు నీకు ఏ విధంగా సహాయపడతారో అదికూడా, యిప్పుడే పరీక్షించి చూతాం!" అన్నాడు.

తండ్రి సలహాప్రకారం కొడుకు గోతాన్ని భుజానవేసుకుని తన తండ్రికి గల అర్ధ స్నేహితుడివద్దకు వెళ్లి తన స్నేహితులతో చెప్పినట్టే చెప్పాడు. ఆ స్నేహితుడు అంతా విని, "నేను నిన్నెరగను, కాని నీ తండ్రి నాకు స్నేహితుడు. ఆయన కోసం నీకు సహాయపడతాను," అన్నాడు.

తరవాత ఆయన పందిఉన్న గోతాన్ని రహస్యంగా రాత్రిపూట పెరట్లో పాతేసి. "ఇక నీకేమీ భయం ఉండదు. నిశ్చింతగా తిరుగు!" అన్నాడు.

ఈ సంగతి కొడుకుద్వారా తెలుసుకుని తండ్రి ఆ ఊరి తలారికి తన నౌకరుద్వారా ఒక వార్త పంపాడు. ఆ నౌకరు తలారి వద్దకు వెళ్లి, "అయ్యా, మా యజమాని గారి కొడుకు ఒక మనిషిని చంపి గోతంలో పెట్టి ఫలానివారి ఇంటికి పట్టుకుపోయాడు. ఆ పెద్దమనిషి ఆ గోతాన్ని తమ పెరట్లో పాతేయించి మా యజమాని కొడుకును కాపాడాడు!" అని చెప్పాడు.

వెంటనే తలారి భటులను పంపి పెరడు తవ్వించగా గోతం దొరికింది.



ధనికుడి అర్ధస్నేహితుడు తలారితో, "అయ్యా, ఈ కుర్రవాడు మా ఇంటికి ఒక సారి వచ్చి తాను ఫలానా అని నాతో చెప్పిన మాట నిజమే. అంతకు పూర్వంగాని, ఆ తర వాతగాని నేనా కుర్రవాణ్ణి చూడనేలేదు. నాకు తెలియకుండా అతనే నా పెరట్లో ఈ గోతాన్ని పాతివుంటాడు! నా కీ సంగతి ఏమీ తెలీదు!" అన్నాడు.

ఈలోపుగా ధనికుడి కొడుకు తన తండ్రికి గల రెండో స్నేహితుడివద్దకు వెళ్ళి, "అయ్యా, నేను తొందరపడి ఒక మనిషిని హత్య చేశాను. మా తండ్రి స్నేహితు డొకాయన శవం గల గోతాన్ని తన పెరట్లో పాతిపెట్టి నన్ను కాపాడాడు. కాని ఈ సంగతి ఎలాగో బయటపడింది. నాకు ఉరిశిక్ష తప్పేటట్టు లేదు. ఏవిధంగానైనా నాకు సహాయపడ గలరా?" అని అడిగాడు.

ఈ మాట వింటూనే ధనికుడి స్నేహి తుడు బయలుదేరి తలారివద్దకు వెళ్ళి, "అయ్యా, ఫలాని కుర్రవాడిమీద హత్యా నేరం మోపినట్టు విన్నాను. అది నిజంగా అతను చేసిన హత్య కాదు. హంతకుడు నా కొడుకే! ఒకరు చేసిన హత్యకు ఇంకొ కరు ఉరిపడటం భావ్యం కాదు. అందుచేత ఇష్టం లేకపోయినా నిజం చెప్పవలిసి వచ్చింది. నిర్దోషి అయిన ఆ కుర్రవాణ్ణి వదిలిపెట్టి, దోషి అయిన నా కొడుకును ఉరి తీయించండి!" అన్నాడు.

ఈ మాట తెలియగానే ధనికుడు తన కొడుకుతో, "చూశావురా, నిజమైన స్నేహి తుడు ఎలా ఆదుకుంటాడో! ప్రతివాళ్ళూ స్నేహితులని నమ్మకు!" అంటూ బయలు దేరాడు. ఆయన తలారివద్దకు వెళ్ళి జరిగిన దంతా చెప్పి, "ఆ గోతంలో ఉన్నది మనిషి కాదు. పంది. కావాలంటే, గోతం విప్పి చూడండి," అన్నాడు.

తలారి వెంటనే గోతం విప్పిచూసి చాలా ఆశ్చర్యపోయాడు.





# మిత్రభేదం

అది విని కరటకుం - డౌను లెమ్మనుచు
ముదముతో నిట్లని - మురియుచు జెప్పె
"పొమ్ము సంజీవక-మ్మును పింగలకము
నెమ్మదిగా భేద-నీతితో జీల్చి
జయమంది రమ్మోయి - సావాసకాడ
నయముగా పని పూర్తి-నందించి రమ్ము"
అ మాటతో కొంత - ఆనంద మంది
గోమాయు వంతట - గునగున పోయి
మృగముల రాజున్న - మెట్టకు వెళ్ళి
తగు సమయానకు - తారాడుచుండె.
మృగముల రాజొక్క-డే ఉంట జూచి
దిగబడి మ్రొక్కి ముం-దుగ గూరుచున్న
దమనకు రాజు సే-మము విచారించి
"సుమతి ఇన్నాళ్ళకా - చూడ వచ్చితివి?"
అనగానె దమనకుం - డనె నిట్లు "మీకు
పని లేదు మాతోడ - నని రానుగాని
దొరగారి కిప్పుడు - చెఱుపగు నంచు
బిరబిర వచ్చితి - పిల్వక ముందె
అప్రియమ్మైనను - అశుభమ్మైయైన,
సుప్రసన్నత దొర - చూపక యున్న
హితము జెప్పగ వలె - నేమైనగాని
మతిమంతు లైనట్టి - మంత్రు లెల్లపుడు"
అనుటతో రాజు నీ - కనుమాన మేల
వినిపింపు మేదైన - విజ్ఞప్తి యున్న
అనినంత దమనకుం - డటు నిటు జూచి
వినయ ముట్టిపడంగ - వేసె మంత్రమ్ము
"ఓ రాజ యేమందు-నో రాడ లేదు
ఘోర మా సంజీవ - కుడు మీకు చెఱుపు
సేయ జూచుచు నుండె - చెవిలోన జెప్పె
ఈ యడవికి పెద్ద - ఇంక తానంట
మిమ్మెట్లొ నమ్మించి - మెల్లగా చంపి
దిమ్మరమ్ముగ జేయు - దీపావళింక"
పిడుగు పడ్డట్లయి - పెద్ద సింహమ్ము
ముడుచుక కూర్చున్న - ముది నక్క అనియె
"విపరీతమైనట్టి - విశ్వాస మునిచి
నపుడిట్లు వచ్చుట - ఆశ్చర్య మెట్లు?"

విద్వాన్ విశ్వం



అన విని మెల్లగా - నా రాజు పలికె
"అనుగు మిత్రుడు కదా - అతడు నాకు"

దమనకుడు :

నేస్తుడా కాదన్న - నీతి యెక్కడిది
విస్తార రాజ్యమ్ము - వేడుక పడరె?
దొరతనమ్మన్న నెల్లర కాశ యుండు
మఱి శక్తిహీనులే - మఱుగు చేరుదురు.

పింగళకుడు :

ఏమైనగాని నా - కితడు మిత్రుండు
నామిత్రు నెట్లు నే నమ్మక యుందు?

దమనకుడు :

అదె దోషమగు మైత్రి - యధికమౌ చోట
ఎది కానిపించదు - హితము విన్పడదు.
ద్రోహబుద్ధిని వాని - తొలగింప వలయు
మోహ బుద్ధిని వాడు - మోసము సేయు.
బలవంతు డీతడు - పగతుర నడచు
చలపట్టి, యనికూడ - తలపగా రాదు.
గడ్డిగాదము దిను - కష్టుడు వీడు
విడ్డూరమిది వాని - వీరత్వ మెంత?

పింగళకుడు :

ఒకపరి మంచి వాడో యని చాటి
వెకిలిగా పిదప ఏవిధి నిందసేతు
నీ మాట విని వాని - నిటకు రావించి
ఏ మాత్ర భయము లే - దింక నీ కంటి
ఇపుడు నే నేమని - హింసింతు వాని
రిపుడు కాడాయె నా - కెపుడునుగూడ
విసపు చెట్టునుగూడ - వేసిన పిదప
కసి తాను కొట్టుట - కార్యమ్ము కాదు.
తొలుత సాయముసేసి - త్రోయుట తగదు
పిలిచి పెత్తనమిచ్చి - తొలగించరాదు.
ఉపకారి కుపకార - మొందించు టేమి
అపకారి కుపకార - మది సేయవలయు
వాని ద్రోహపు బుద్ధితో నాకు నేల?
వానిలో చెడుగున్న - వాడె పాడగును

దమనకుడు :

రాచ పాడియె కాదు - రాజాధి రాజ?
కాచుట యేల ముక్కడియైన వాని?
సరి బలమ్మును సరి-సామర్థ్య మున్న

సరివాని భృత్యుగా - సంధింపరాదు.
వీని మూలమ్ముగ - వీరత్వ ముడిగి
మానితి వీవిటు - మాంసాశనమ్ము
నీ ప్రజలందఱు - ని న్విడనాడి
ఏ ప్రాంతములకొ తా - మేగుచున్నారు
మీరు కొన్నాళ్ళలో - మీ పరాక్రమము
దారిని విడనాడి - తరలి పోగలరు.
ఎటువంటి మిత్రుల - నిటు చేర్చుకొనునొ
ఎటువంటి వారల - నిటు మెచ్చుకొనునొ
అటువంటి వాడుగా - అధిపుడు మాఱు
కటువైన చెప్పియే - కావలె నాకు
నల్లి కోసము పేను - నలిగిపోయినది
చల్లగా వానిని - చంపగ వలయు
తనవారి వెలివేసి - తనకు కానట్టి
మనుజుల గూర్చు కొ-న్నను చావు నిజము
మునుపిల్లె ఒక రాజు - చనిపోవలేదె
వినిపింతు నా కథ - వినుడింక మీరు.

నీలికుండలో పడిన నక్క కథ :

ఉండెను వనభూమి - ఒక నక్క మున్ను
చండరవ మ్మని - జను లంద్రు దాని
ఒకనాడు తిండి చిక్కకపోయి విసిగి
ఒక పట్టణమ్ములో-నికి నేగె నక్క.
ఊర కుక్కలు చూచి - ఉరుకుచు వచ్చి
దారీక కఱచిన - తట్టుకో లేక



గొబ్బున చాకలి-గుడిసెలో దూఱె
తబ్బిబ్బు పడిపోయి - దాచుకో జూచె.
కుక్కలు మొఱుగుచు - కోఱలు సూప
అక్కడనే ఉన్న - ఆ నీలికుండ
చూడక, అందులో - జోరుగా దూకి
గోడాడి గోడాడి - కుండ దొర్లించి
బయటకు వచ్చిన - పై నీలిరంగు
భయపెట్ట, కుక్కలు - పారిపోయినవి.
రంగేది మునుపున్న - రాకాసి నీలి
రంగొక్కటే వాని - ప్రమింగుట నిజము.
నీలినక్కను చూచి - చాల మృగాలు
చాలించుకొనె దాని - చాయకు రాక.



# ఓర్వలేనితనం

ఒక గ్రామంలో బలభద్రుడనే పేదకాపు ఉండేవాడు. వాడికి చాలామంది పిల్లలు. బలభద్రుడు రోజూ అడివికి వెళ్లి కట్టెలు కొట్టి తెచ్చేవాడు. వాటిని అమ్మగా వచ్చిన చిల్లరడబ్బులతో పిల్లల కింత గంజి పోసి, తానూ తన భార్యాకూడా తాగుతూండేవాళ్లు. బలభద్రుడు ఎంత కష్టపడినా ఒక పూట కూడా వాడి కుటుంబానికి కడుపు నిండా తిండి ఉండేదికాదు.

ఒక రోజు ఉదయం బలభద్రుడు గొడ్డలి భుజాన వేసుకుని అడివికి బయలు దేరాడు. దారిలో సన్నగా చినుకు ఆరంభమై, వాడు అడవికి చేరేలోపుగా ధారాపాతంగా వాన కురవసాగింది. అదృష్టవశాత్తు అడివిలో వాడి కొక పాడుపడిన చావడి కనపడింది. వాడు అక్కడికి పరిగెత్తి చావడి కింద నిలబడి వాన ఎప్పుడు వెలుస్తుందా అని చూడసాగాడు.

కాని వాన ఎంతకీ తగ్గలేదు. "ఎండు కట్టెలన్నీ తడిసిపోయి ఉంటాయి. తడి కట్టెలు తీసుకుపోతే ఎవరూ కొనరు. ఈ పూట పిల్లలకు గంజికూడా ప్రాప్తంలేదు!" అనుకుంటూ బలభద్రుడు చావడి చుట్టూ కలయచూశాడు. ఒక పక్కగా వాడికొక కొయ్యవిగ్రహం కనబడింది. వాడు ఆశపడి దగ్గిరికి వెళ్లి చూస్తే అది ఒక అమ్మవారి విగ్రహంలాగా తోచింది.

అమ్మవారి విగ్రహమైతేనేం, అయ్యవారి విగ్రహమైతేనేం? అది కొయ్యవిగ్రహం; వానకు తడవలేదు; పేళ్లువేస్తే మోపెడు కట్టెలవుతుంది. అడివంతా ఘాలించినా ఇది తప్ప మరొక ఎండుకట్టె దొరికే అవకాశం లేదు. ఈ కట్టెను పేళ్ళువేసి తీసుకుపోతే నాలుగు డబ్బులు గిట్టుతాయి. తానూ భార్యా, పిల్లలూ ఆ పూటకు ఇంత గంజి కాచుకుని తాగవచ్చు!

ఎస్. లలితకుమారి





ఈ విధంగా ఆలోచించి బలభద్రుడు గొడ్డలి ఎత్తి విగ్రహం నెత్తిన వెయ్యబోయాడు. అంతలో విగ్రహంలోనుంచి మాటలు వినిపించాయి:

"ఆఁ, ఆఁ! ఆగు! నన్ను తల పగల గొడతావుట్రా, దుర్మార్గుడా? నే నెవరనుకున్నావు?"

బలభద్రుడు వెంటనే గొడ్డలి దించి విగ్రహానికి దణ్ణం పెట్టి, "క్షమించు, తల్లీ! ఇందులో నువు ఉన్నావనుకోలేదు. పూజా పునస్కారాలు లేని కొయ్యబొమ్మ అనుకున్నాను. కట్టెలు కొట్టుకు పోదామని వస్తే వాన వచ్చింది. అడివంతా తడిసిపోయింది. ఈ బొమ్మలోనేమో నువ్వుంటివి! ఇంకేముందీ? మాకూ పిల్లలకూ ఈ పూట గంజి కూడా లేదు!" అన్నాడు వైరాగ్యంగా.

"ఒరే, నీ బీదస్థితి నాకు అర్థమయింది. నాకు నీమీద ఏమీ కోపంలేదు. బీదరికం ఇంతకన్నకూడా ఘోరాలు చేయిస్తుంది. నువు సుఖపడే పద్ధతి నేను చెబుతాను విను. నువు ఇంటికి వెళ్ళి కొత్తకుండ తెచ్చి, నా పేరు తలుచుకుని దాన్ని ఉత్త పొయ్యిమీద పెట్టు. వెంటనే అందులో నీకూ, నీ కుటుంబానికీ కావలసిన ఆహారమంతా ఉంటుంది. ఈ నాటినుంచీ తిండికి కొరత లేకుండా మీరూ, మీ పిల్లలూ హాయిగా ఉండండి!" అన్నది విగ్రహం.

బలభద్రుడు తన చేతిలో ఉన్న గొడ్డలి దూరంగా గిరవాటేసి, విగ్రహం కాళ్ల ముందు సాష్టాంగపడి లేచి, వానకూడా లక్ష్యపెట్టకుండా ఇంటికి వెళ్లిపోయాడు.

తన భర్త వట్టి చేతులతో ఇంటికి రావటం చూసి బలభద్రుడి భార్య ఆశ్చర్యపోతూ, "కట్టెలు కొట్టుకు రాలేదా? గొడ్డలి ఏమయింది? ఈ పూట మనమంతా పస్తేనా?" అని అదుర్దాగా అడిగింది.

"ఇక మనకు కట్టెలతోనూ, గొడ్డలితోనూ పనిలేదు. అమ్మవారు అనుగ్రహించింది!"







అంటూ బలభద్రుడు భార్యకు అడివిలో జరిగినదంతా చెప్పాడు.

బలభద్రుడి భార్య ఒక కొత్తకుండ తెచ్చి దానిపైన మూత ఒకటి పెట్టి పట్టి పొయ్యి మీద పెట్టి దించింది. మూత తీసి చూస్తే అందులో సమస్తమైన ఆహారాలూ, పిండి వంటలూకూడా ఉన్నాయి. భార్యాభర్తలూ, పిల్లలూకూడా తమ జన్మలో మొదటిసారి సుఖంగా భోజనంచేసి పడుకుని హాయిగా నిద్రపోయారు.

అదిమొదలు బలభద్రుడి కుటుంబానికి తిండికొరత లేదు. వాళ్లు పూటపూటా షడ్రసో పేతంగా భోజనంచేస్తున్నారు. వాళ్లు తినటమే గాక, ఇరుగుపొరుగు వాళ్లను పిలిచి వారికి కూడా మృష్టాన్న భోజనాలు పెడుతున్నారు.

బలభద్రుడి ఇంటి పక్కనే ఇంకొక ఇల్లున్నది. ఆ ఇంటావిడ పేరు మండోదరి. జన్మలో ఎన్నడూ గంజితప్ప ఎరగని బల భద్రుడి కుటుంబం రోజూ సుష్టుగా భోజనం చేస్తూండటం గమనించి మండోదరి, "ఇంత ఉన్నవాళ్లం మాకే సాధ్యంకాదుగదా, ఈ గర్భదరిద్రులు రోజూ పిండివంటలు ఎలా చేసుకుంటున్నారు? ఎలా పదిమందికీ పెట్టగలుగుతున్నారు? ఇంతలోనే వీళ్ల కింత సిరి ఎత్తుకోవటానికి కారణమేమిటి?" అనుకున్నది.

ఆవిడ బలభద్రుడి చిన్న కొడుకును పిలిచి, "ఒరే, మీ నాన్న అడివికిపోయి కట్టెలు తీసుకురావటంకూడాలేదు. ఈ వంట సరుకులన్నీ ఎట్లా తెస్తున్నారు? రోజూ మీ అమ్మ ఇంత పెద్ద వంటలు ఒంటరిగా ఎట్లా చెయ్యగలుగుతున్నది?" అని అడిగింది.

బలభద్రుడి కొడుకు మండోదరితో నిజం చెప్పేశాడు. "అడివిలో దేవత అనుగ్రహించి మాకు కుండలో అన్నీ ఇస్తున్నది. మా అమ్మ వంట చెయ్యదు, మా నాన్న సరుకులూ తీసుకురాడు!" అంటూ వాడు అడివిలో జరిగిన వృత్తాంతమంతా చెప్పాడు.



ఇది వినేసరికి మండోదరికి పట్టరాని అసూయ కలిగింది. ఆవిడ తలకు గుడ్డ కట్టుకుని మూలుగుతూ మూల పడుకున్నది. వంట చెయ్యలేదు. "అమ్మా, అన్నం పెట్టు!" అని పిల్లలు దగ్గిరికి వస్తే, వాళ్లను తిట్టి కసిరి కొట్టింది.

భోజనంవేళకు మండోదరి భర్త ఇంటికి వచ్చి పొయి రాజకపోవటం చూసి, "ఏం జరిగింది?" అని అడిగాడు.

"ఏం జరిగిందా? దేశంలో అడ్డమైన వాళ్లూ దేవత అనుగ్రహం సంపాదించి పొయికూడా వెలిగించకుండా పంచ భక్ష్య పరమాన్నాలూ మెక్కుతుంటే నేను రోజల్లా ఒళ్లు విరుచుకుని అంతులేని చాకిరీ చెయ్యవలిసివచ్చింది!" అన్నది మండోదరి.

ఆవిడద్వారా విషయమంతా తెలుసుకుని మండోదరి భర్త, "అయితే నన్నిప్పుడేం చెయ్యమంటావు?" అన్నాడు.

"ఇంకా అడుగుతావెందుకు? గొడ్డలి పట్టుకుపోయి అడివిలో ఉండే అమ్మవారిని తల పగలగొడతానని బెదిరించి వరం పొంది రా! నేను ఇకమీదట వంట చేసేది లేదు!" అన్నది మండోదరి.

"దేవతలను ఎక్కడైనా తల పగలగొడతారా?" అన్నాడు భర్త.



నీకు కొంచెమన్నా జ్ఞానం లేదు. మొక్కితే వరమియ్యని దేవత మొట్టితే ఇస్తుంది!" అన్నది మండోదరి.

తన భార్య చెప్పినప్రకారం చెయ్యకపోతే తనకు శాంతి ఉండదని తెలిసి మండోదరి భర్త గొడ్డలి భుజాన వేసుకుని అడివికి వెళ్లాడు. కొంచెం వెతికినమీదట అతనికి అడవిలో చావిడీ, అందులో అమ్మవారి కొయ్యవిగ్రహమూ కనిపించాయి. మండోదరిభర్త అమ్మవారి విగ్రహాన్ని సమీపించి గొడ్డలి ఎత్తాడు.

మరుక్షణం భూమి దద్దరిల్లింది. విగ్రహం నుంచి మెరుపులాటి కాంతి వచ్చి అతని

కళ్లు గుడ్డిగా అయిపోయాయి. ఎవరో తన్ని నట్టుగా అతను పడిపోయాడు. ఆ స్థితిలో అతనికి ఒక భీకరమైన కంఠం వినిపించింది:

"నీచుడా! నన్నే తలమీద కొడతా వుట్రా! ఎవరనుకున్నావు?" మండోదరి భర్త వణికిపోయాడు. అతని శరీరమంతా నజ్జునజ్జు అయినట్టయి, మంట లెత్తసాగింది.

"క్షమించు, తల్లీ! నేరక అపరాధం చేశాను. ఈ పని చేస్తేనే నువు ఆ బల భద్రుడిపైన అనుగ్రహించావు. నాపై ఎందు కాగ్రహించుతున్నావు?" అన్నాడతను.

"బలభద్రుడు గర్భదరిద్రుడు! నువు దరిద్రుడివి కావే? నిన్నెందుకు క్షమిం చాలి?" అన్నది విగ్రహం.

"వాడు దరిద్రుడైతే నేను అజ్ఞానిని! క్షమించు, తల్లీ!" అంటూ మండోదరి భర్త బోర్లాపడి ఏడిచాడు.

"ఒక్క షరతుమీద నిన్ను ఈసారికి క్షమిస్తాను. నేను బలభద్రుడికి పాత్రలో అన్నీ వచ్చేట్టు అనుగ్రహించానుగాని నెయ్యి ఇవ్వటం మరిచాను. పాపం వాళ్లంతా నెయ్యి లేని కూడు తింటున్నారు. కనక నువు ఇంటికి వెళ్లి రోజూ వాళ్లకు సేరు చొప్పున మంచి నెయ్యి ఇస్తూ ఉండు! అందుకు ఒప్పుకుంటే నిన్ను క్షమిస్తాను!" అన్నది అమ్మవారి విగ్రహం.

"నీ యిష్టం, తల్లీ! నువ్వేం చెయ్య మంటే అది చేస్తాను. నా తప్పుమటుకు క్షమించు!" అన్నాడు మండోదరి భర్త. అతని బాధలన్నీ తీసేసినట్టు పోయాయి. అతను ఇంటికి తిరిగివచ్చి జరిగినదంతా భార్యకు చెప్పి, "స్త్రీ బుద్ధి ప్రళయాంతక మని ఊరికే అన్నారా? ఇకనుంచీ రోజూ సేరు నెయ్యి బలభద్రుడి ఇంటికి పంపుతూ ఉండు!" అన్నాడు.

చేసేదిలేక మండోదరి భర్త చెప్పినదానికి అంగీకరించి, ప్రతిరోజూ బలభద్రుడి యింటికి సేరు నెయ్యిపంపుతూండేది.






## 7

[ట్రోయ్ నగరాన్ని గ్రీకులు ముట్టడించిన తొమ్మిది సంవత్సరాలకు గ్రీకు శిబిరంలో అంతఃకలహం ఏర్పడి, గ్రీకు వీరులలో అగ్రగణ్యుడైన వజ్రకాయుడు యుద్ధరంగం నుంచి వైదొలిగాడు. అది చూసి ట్రోజనులు విజృంభించి గ్రీకులను చావుదెబ్బ కొట్టారు; ఒక గ్రీకు నౌకకు నిప్పుకూడా అంటించారు. ఇంత పని జరిగాక వజ్రకాయుడు తటస్థంగా ఉండలేక తిరిగి యుద్ధరంగానికి వచ్చాడు. ట్రోజను వీరులలో అగ్రగణ్యుడైన వీర సింహుడు వజ్రకాయుడి చేతిలో చచ్చిపోయాడు. భువనసుందరిని ఎత్తుకుపోయిన మోహనుడు సూర్యాలయంలో వజ్రకాయుడి కుడి మడమను కొట్టి అతన్ని చంపేశాడు.]

వజ్రకాయుడి మరణానంతరం ఆచారం ప్రకారం పోటీపందెములు జరిగాయి. పరుగులో దేవమయుడూ, చక్రం విసరటంలో భూధవుడూ గెలిచారు.

వజ్రకాయుడి తల్లి తటిని తన కొడుకు తాలూకు అస్త్రశస్త్రాలను మిగిలిన గ్రీకులలోకెల్లా మహాయోధుడైనవాడికి ఇచ్చేస్తానని అన్నది. వజ్రకాయుడి శవాన్ని సాహసోపేతంగా రక్షించి తెచ్చిన రూపధరుడూ, భూధవుడు మాత్రమే సాహసించి ఆ అస్త్ర శస్త్రాలకు తాము అర్హులమని ప్రకటించారు. మరెవరికీ ఆ ధైర్యం లేకపోయింది.

వారిద్దరిలో ఎవరు ఉత్తమయోధుడో రారాజు తేల్చలేక, వయోవృద్ధుడూ, జ్ఞాన వృద్ధుడూ అయిన నవద్యోతుణ్ణి యీ విషయమై సలహా అడిగాడు.



మిగిలిన ఆడవాళ్లంతా ఈమాట నిజమన్నారు.

వేగులవాళ్లు ఈ సంగతి తీసుకుపోయి రారాజుకు తెలియజేశారు. అప్పుడు రారాజు వజ్రకాయుడి శస్త్రాస్త్రాలను రూపధరుడికే ఇప్పించాడు.

ఇది నిజంగా భూధవుడికి అవమానమే. వజ్రకాయుడే బతికిఉంటే తన దాయాది అయిన భూధవుడికి ఇంత అవమానం కలగటం చూసి రారాజునూ, ప్రతాపుణ్ణీ ఏమి చేసి ఉండేవాడో. అతను లేడు గనకనే రారాజు రూపధరుణ్ణి భూధవుడికన్న గొప్ప యోధుడుగా నిర్ణయించగలిగాడు.

కోపావేశంలో భూధవుడికి మతిపోయింది. గ్రీకులు ట్రోయ్ పరిసరాలలో కొల్లగొట్టిన పశువులన్నీ ఒకచోట ఉన్నాయి. భూధవుడు ఉన్మాదంలో వాటి మధ్యకు పోయి వాటిని చిత్రవధ చేశాడు. రెండు తెల్లకాళ్ల గొర్రెలను చూసి, ఒకదాన్ని రారాజో, ప్రతాపుడో అనుకుని, దాని తల తెగవేశాడు. రెండవదాన్ని రూపధరుడనుకుని, దాన్ని ఒక గుంజకు నిలబెట్టి కట్టి కొరడాతో కొట్టాడు. కొంతసేపటికి అతని ఉన్మాదం శాంతించింది. తరవాత అతను సముద్రతీరానికి వెళ్ళి అక్కడ కత్తితో పొడుచుకుని ఆత్మహత్య చేసుకున్నాడు.





త్వరలోనే ధనధవుడి ప్రాణం నయమయి పోయింది. అతను లేచిన రోజునే యుద్ధ రంగానికి బయలుదేరి మోహనుణ్ణి విలు యుద్ధానికి అహ్వానించాడు. ఈ యుద్ధంలో ధనధవుడు విసిరిన మొదటి బాణం మోహనుడికి తగలలేదు. కాని రెండవది మోహనుడి ఎడమచేతికి—బాణం పట్టిన చేతికి—తగిలింది. మూడవ బాణానికి మోహనుడి కుడికన్ను పోయింది. నాలుగవ బాణంతో ధనధవుడు మోహనుడి కాలి మడమను బలంగా కొట్టాడు.

మోహనుడు అపాయస్థితిలో ఉండటం చూసి ప్రతాపుడు ఒక్క దెబ్బతో అతన్ని యమపురికి పంపుదామనుకున్నాడు. కాని, మోహనుడు కుంటుకుంటూ ప్రతాపుడికి చిక్కకుండా కోటగోడలలోపలికి వెళ్లి పోగలిగాడు. మోహనుడికి చికిత్స చెయ్యటానికిగాను ఐడాపర్వతంనుంచి ఓషధులను గంపలో తెప్పించారు. కాని అవి వచ్చేలోపలనే అతను ప్రాణాలు విడిచాడు.

మోహనుడు పోగానే, భువనసుందరి నాకు భార్య కావాలంటే నాకు భార్య కావాలని మోహనుడి సోదరులలో చంద్రుడూ, అరిభయంకరుడూ తగాదా పడ్డారు. అరిభయంకరుడే యుద్ధంలో ఎక్కువ పరా



క్రమం ప్రదర్శించాడనే ఉద్దేశంతో వర్ధనుడు అతని పక్షంగా తీర్పుచెప్పాడు. కాని భువనసుందరి మటుకు తాను స్పార్టారాణి ననీ, ప్రతాపుడి భార్యననీ మరిచిపోనేలేదు. ఆమె తనవారైన గ్రీకులను చేరుకునే ఉద్దేశంతో ఒకనాటిరాత్రి కోటగోడలపైకి వెళ్లి బయటికి జారటానికి ఒక మోకు సిద్ధంచెయ్య సాగింది. ఈ సమయంలో పహరావాడొకడు ఆమెనుచూచి, పట్టుకుని రాజభవనానికి తిరిగి తెచ్చాడు.

అరిభయంకరుడు ఆమెను బలాత్కారంగా వివాహమాడాడు. ఈ వివాహం ట్రోజనులకు ఎంతమాత్రం నచ్చలేదు.



చంద్రుడు విరక్తిచెంది ట్రోయ్‌నగరం విడిచి ఐడాపర్వతంమీద నివసించటానికి బయలుదేరిపోయాడు. చంద్రుణ్ణి ఏ విధంగా నైనా పట్టుకున్నట్టయితే అతనినుంచి ట్రోయ్ మర్మాలు తెలుసుకుని యుద్ధం విజయ పంతం అయేటట్టు చూడవచ్చునని కాంశు కుడు రారాజుకు చెప్పాడు. ఎలాగైనా చంద్రుణ్ణి పట్టుకోమని రారాజు రూపధరుణ్ణి ప్రోత్సహించి పంపాడు.

చంద్రుడు సూర్యాలయంలో హేమ తండ్రికి అతిథిగా ఉంటూవున్న సమయంలో రూపధరుడు అతన్ని వెతుక్కుంటూ అక్కడికి వచ్చాడు

"నేను ప్రాణాలకు వెరిచి పారిపోయి రాలేదు. ఈ ఆలయంలోనే మోహనుడు వజ్రకాయుణ్ణి అక్రమంగా చంపాడు. అందు కింకా ప్రాయశ్చిత్తం జరగలేదు. అదే నన్ను బాధిస్తున్నది. ఎక్కడైనా దూరప్రాంతంలో సురక్షితంగా నేను ఉండేటందుకు తగిన ఏర్పాటు చేసినట్టయితే, నేను ట్రోయ్ మర్మాలు దాచకుండా చెప్పగలను," అని చంద్రుడు రూపధరుడితో అన్నాడు.

ఇందుకు రూపధరుడు సమ్మతించాడు.

"రాగల వేసవిలో ట్రోయ్‌నగరానికి పతనం రాసిపెట్టి ఉన్నది. కాని అది అయే లోపుగా మూడు పనులు జరగాలి. ఒకటి:





పీసాలో ధూమ్రముఖుడి భుజం ఎముక ఉన్నది; అది మీ శిబిరం చేరాలి. రెండు: నవయోధుడు రణరంగంలోకి రావాలి. మూడు: బుద్ధిమతీదేవి విగ్రహాన్ని కోట నుంచి కాజేయాలి; అది ఉండగా ట్రోయ్ గోడలను మీరు పడగొట్టలేరు," అని చంద్రుడు రూపధరుడికి చెప్పాడు.

ఈ రహస్యం తెలియగానే రారాజు ధూమ్రముఖుడి అస్థికను తీసుకురావటానికి కొందరిని పీసాకు పంపాడు. వజ్రకాయుడి కొడుకైన నవయోధుడు, పన్నెండేళ్ల బాలా కుమారుడు, స్కైరాస్‌లో ఉంటున్నాడు. అతనిని తీసుకురావటానికి రూపధరుడూ, రక్తవర్ణుడూ, దేవమయుడూ నౌకలో బయలుదేరివెళ్ళారు. నవయోధుడు యుద్ధ రంగంలో కాలు పెట్టగానే అతనికి అతని తండ్రి అయిన వజ్రకాయుడి ప్రేతాత్మ కనిపించింది. వజ్రకాయుడి శస్త్రాస్త్రాలను రూపధరుడు నవయోధుడికి ఇచ్చేశాడు.

వయసులో చిన్నవాడై ఉండికూడా నవయోధుడు రణరంగంలో తన తండ్రి పేరు నిలబెట్టాడు. అతను యుద్ధవ్యూహ రచనలలోకూడా గ్రీకులకు సలహాలిచ్చాడు.

పోతే బుద్ధిమతి విగ్రహాన్ని దొంగిలించే పని మిగిలి ఉన్నది. ఈ పని చేయటానికి రూపధరుడూ, దేవమయుడూ పూను





కున్నారు. రూపధరుడు దేవమయుడిచేత వొళ్లంతా రక్తం కారేట్టు కొట్టించుకుని శరణు జొచ్చే బానిసలాగా ట్రోయ్‌నగరం ప్రవేశించాడు. అతన్ని ఒక్క భువనసుందరి మాత్రమే గుర్తించింది. అతను ఇలాటి రూపంలో రావటానికి కారణం తెలుసుకుందామని ఆమె యత్నించింది. కాని రూపధరుడు ఆమె ప్రశ్నలకు సరి అయిన జవాబులు చెప్పలేదు. ఆమె అతన్ని తన యింటికి తీసుకుపోయి స్నానంచేయించి, భోజనంపెట్టి, "నే నిక్కడ ఖైదీగా జీవిస్తున్నాను. నాకు మనదేశం వెళ్ళాలని ఉన్నది. ఈ సంగతి మా అత్తగారికి మాత్రమే తెలుసు. అయితే, ఆమె నా పక్షమే. మీ కార్యక్రమం నాకు వివరంగా చెప్పాలి!" అన్నది.

సరిగా ఆ సమయానికే వర్ధనుడి భార్య అక్కడికి వచ్చింది. రూపధరుడి పై ప్రాణాలు పైనే పోయాయి. అతను ఆవిడ కాళ్లమీద పడి, భయంతో శోకాలు పెడుతూ, "నన్ను బయటపెట్టకండి!" అని ప్రార్థించాడు. వర్ధనుడి భార్య అతన్ని బయట పెట్టకపోగా అతను సురక్షితంగా తిరిగి వెళ్ల టానికకూడా తోడ్పడింది.

వెళ్ళేటప్పుడు రూపధరుడు బుద్ధిమతి విగ్రహాన్ని దొంగిలించాడు. గోడల అవతల కనిపెట్టుకుని ఉన్న దేవమయుడి భుజాన దాన్ని పెట్టాడు. ఇద్దరూ పున్నమి వెన్నెలలో నడుస్తూ శిబిరానికి వెళ్ళసాగారు. మధ్యలో రూపధరుడికి ఈ విగ్రహం తెచ్చిన కీర్తి తానే పొందాలన్న దుర్బుద్ధి పుట్టింది. అతను ఒక అడుగు వెనక్కు తగ్గి, దేవమయుణ్ణి చంపటానికి కత్తి ఎత్తాడు. ఎత్తిన కత్తినీడ చూసి దేవమయుడు గిరుక్కున వెనక్కు తిరిగి, తన కత్తి దూసి రూపధరుణ్ణి నిరాయుధుణ్ణి చేశాడు. ఆ తరవాత దేవమయుడు రూపధరుణ్ణి పెడరెక్కలు విరిచికట్టి, తన్నుకుంటూ శిబిరానికి తీసుకుపోయాడు!

(ఇంకా ఉంది)



# పని నిదానం

ఒక పెద్దమనిషి తనకు కొత్తగా కలిగిన కుమారుడికోసం ఉయ్యాలతొట్టె చేయించటానికై వడ్రంగివద్దకు వెళ్ళి బేరం కుదుర్చుకున్నాడు.

"నువ్వడిగినదానికి నేను ఒప్పుకున్నాను. కాని నాకు ఉయ్యాలతొట్టెమాత్రం త్వరగా అందాలి," అన్నాడు పెద్దమనిషి.

"నా పనితనం మీరే చూస్తారుగా. అయితే తొందరగా ఇవ్వటంమాత్రం నావల్లకాదు. నిదానంమీద చేస్తేనేగాని పనితనం వుండదు," అన్నాడు వడ్రంగి.

"ఔనౌను. కాని సాధ్యమైనంత త్వరలో పని జరిగేటట్టు చూడు," అంటూ పెద్దమనిషి వెళ్ళిపోయాడు. ఒక వారం గడిచాక ఆయన తొట్టెకోసరం వెళ్ళాడు.

ఇంకా తయారుకాలేదన్నాడు వడ్రంగి. ఎందుచేత కాలేదని అడిగాడు పెద్దమనిషి. "నేను మొదటనే చెప్పాగా? ఏదో అడ్డదిడ్డం పని చెయ్యటం నాకు సరిపడదు. నిదానంగా చేస్తేనే పనితనం వుండేది," అన్నాడు వడ్రంగి.

ఒక నెల గడిచింది. ఉయ్యాలతొట్టెకోసం పెద్దమనిషి రెండో పర్యాయం వెళ్ళాడు.

"కొంచెం ఆగాలి. పని బాగా చెయ్యాలంటే ఒక రోజులో సాధ్యంకాదు, నెలలోకూడా సాధ్యంకాదు," అన్నాడు వడ్రంగి.

పెద్దమనిషి ఇంకో నెల చూశాడు, రెండు నెల్లు చూశాడు, మూడు నెల్లు చూశాడు, సంవత్సరం గడిచి పోయింది. పెద్దమనిషి తొట్టె ఆశ వదులుకున్నాడు. ఈలోగా పిల్లాడు తప్పటడుగులు వేయసాగాడు, తొట్టెతో అవసరం తీరిపోయింది.

ఆ పిల్లవాడు క్రమంగా పెరిగి పెద్దవాడై ఒక మంచిరోజున పెళ్లిచేసుకున్నాడు. అతని కొక మగపిల్లవాడు కలిగాడు. ఆ పిల్లవాడి కొక తొట్టెఉయ్యాల చేయింతామని అతను బయలుదేరాడు.

"చూడు, నాయనా, నువు పుట్టినప్పుడు ఊరి చివర వుండే వడ్రంగిని ఉయ్యాలతొట్టె చెయ్యమన్నాను. అది ఈసరికి చేసివుంటాడేమో, పట్టుకురా!" అని పెద్దమనిషి తన కొడుకుతో అన్నాడు.

కొడుకు వడ్రంగిని వెతుక్కుంటూ వెళ్లి, "మా నాన్న నా కోసం ఒక తొట్టెఉయ్యాల చెయ్యమన్నాడట. అది తయారై వుంటే నాకిచ్చెయ్యి. నా కొడుక్కు ఉపయోగించు కుంటాను!" అని వడ్రంగితో అన్నాడు.

"అప్పుడే తయారా? ఇప్పుడు పుట్టిన బిడ్డకు ఇప్పుడే ఉయ్యాల తయారుగా ఉంటుందా? మీ నాన్నగారితో అప్పుడే చెప్పాను. చేసే పని అడ్డదిడ్డంగా చెయ్యటం నావల్ల కాదు. నిదానంగా చేస్తేనేగాని పనితనం ఉండదు. తొందరపని చేసి నన్ను పేరు పోగొట్టుకో మంటావా?" అన్నాడు వడ్రంగి. (బల్గేరియా కథ)



# సుఖప్రారబ్ధం

పూర్వం ఢిల్లీచక్రవర్తిదగ్గిర విజయదాసనే ప్రధాని ఉండేవాడు. పేరు చక్రవర్తిదైనా పరిపాలన యావత్తూ విజయదాసుదే కావటంచేత, దేశంలో ఉన్న చిల్లర రాజులూ, సామంతులూ కూడా ఆయనను ఎంతో భయభక్తులతో చూసేవారు. ఆయనను అందరూ విజయమహారాజని పిలిచే వారు.

సమస్తమైన భోగాలూ అనుభవించే స్థితిలో ఉన్నప్పటికీ విజయదాసు మనస్సు వైరాగ్యంవైపే మళ్ళేది. ఆయన మంచి కవిత్వం రాయగలవాడు. అందుచేత విశ్రాంతిగా ఉన్నప్పుడల్లా చక్కని తత్వాలు రచించే వాడు. ఆయన రచించిన తత్వాలను బైరాగులు పాడుకుని ఆనందించేవారు. ఆ విధంగా విజయదాసు రచించిన తత్వాలు కాలక్రమాన దేశం అన్ని మూలలకూ వెళ్లాయి.

హరిద్వారంలో ఉన్న ఒక సన్యాసి మఠానికి విజ్ఞానచంద్రుడనే ఒక తత్వజ్ఞాని వచ్చాడు. అక్కడి సన్యాసులు పాడే తత్వాలు ఆయనకు అపరిమితమైన ఆనందం కలిగించాయి. "ఈ తత్వాలు రచించిన మహాజ్ఞాని ఎవరు? ఆయన ఎక్కడ ఉంటాడు?" అని విజ్ఞానచంద్రుడు అనేక మందిని ప్రశ్నించి, అవి రాసినవాడు విజయదాసనీ, ఆయన ఢిల్లీలో ఉంటాడనీ, వారి ద్వారా తెలుసుకున్నాడు.

ఇంత గొప్ప తత్వజ్ఞానిని తప్పక కలుసుకోవాలని విజ్ఞానచంద్రుడికి కోరిక కలిగింది. ఆయన హరిద్వారంనుంచి బయలుదేరి ఢిల్లీకి వచ్చాడు.

"విజయదాసనే తత్వవేత్త యెక్కడ ఉంటాడు?" అని విజ్ఞానచంద్రుడు ఎంతో మందిని అడిగాడు. కాని ఒక్కరూ చెప్పలేకపోయారు. ఢిల్లీనగరం చాలా పెద్దది.

సి. మనోహరప్రసాద్

అందులో ఎందరో తత్వజ్ఞానులుంటారు. వారినిగురించి జనసామాన్యానికి తెలియదు. మహామంత్రి అయిన విజయమహారాజును ఢిల్లీలో ప్రతి ఒక్కడూ ఎరుగును; కాని ఆయనే తత్వాలు రచించే విజయదాసని విజ్ఞానచంద్రుడికి తెలియదు.

"ఇంత గొప్ప తత్వవేత్తను ఈ నగరంలో ప్రజలు ఎరగకపోవటం ఆశ్చర్యంగా ఉందే?" అనుకుంటూ విజ్ఞానచంద్రుడు అనేక వారాలు ఢిల్లీ అంతా ఘాలించాడు, కాని ప్రయోజనం లేకపోయింది. ఇంతలో ఒకనాడు ఆయన ఒక సన్యాసి మఠం పక్కగా వెళుతూ, లోపలినుంచి విజయదాసు తత్వం విన్నాడు. వెంటనే ఆయన మఠంలోకి వెళ్ళి, "ఈ తత్వం రాసిన తత్వవేత్త ఎక్కడ ఉంటాడు?" అని అక్కడి సన్యాసులను అడిగాడు.

"ఆయన విజయమహారాజు. ఢిల్లీ చక్రవర్తికి మహామంత్రి. దివాణంలో ఆయనకు పెద్ద భవనం ఉన్నది. అక్కడికి వెళ్ళి ఆయన దర్శనంకోసం ప్రయత్నించవచ్చు! కాని అది అంత తేలికగా దొరకదు," అన్నారు సన్యాసులు.

విజ్ఞానచంద్రుడీ మాటలు నమ్మలేకపోయాడు. తత్వజ్ఞాని మహామంత్రిగా ఉండటమేమిటి? ఆయనను అందరూ






మహారాజు అని పిలవటమేమిటి? ఇందులో ఏదో మోసం ఉండాలి!

ఈ మోసం ఏమిటో తెలుసుకునేటందుకుగాను విజ్ఞానచంద్రుడు నేరుగా విజయమహారాజు భవనంవద్దకి వెళ్లి, "నేను మహామంత్రిని ఒకసారి చూడాలి!" అన్నాడు. ద్వారపాలకులు నవ్వి, అది అసాధ్యమని చెప్పారు. రాజాధిరాజులే మహామంత్రిగారి దర్శనం దొరకక వారాలతరబడి పడిగాపులు కాస్తారు; మామూలు సన్యాసివాడికి ఆయన దర్శనం ఎట్లా దొరుకుతుంది?

"ఈ విజయుదాసు పెద్ద వంచకుడు. మహారాజులాగా సుఖాల్లో ఓలలాడుతూ గొప్ప జ్ఞానిలాగా తత్వాలు రాస్తాడు!" అనుకున్నాడు విజ్ఞానచంద్రుడు. ఇటువంటి మోసగాణ్ణి నాలుగు మాటలూ అడగకుండా వెళ్లరాదని నిశ్చయించుకుని ఆయన ద్వారపాలకులతో, "మీ మంత్రిగారి దర్శనమైన దాకా ఇక్కడే ఉంటాను. వెళ్ళి ఈ మాట ఆయనతో చెప్పండి!" అన్నాడు.

మొదట ద్వారపాలకులు లక్ష్యపెట్టలేదు, కాని రెండు రోజులపాటు సన్యాసివాడు వెళ్లిపోకపోవటం చూసి వాళ్లు ధైర్యంచేసి మహామంత్రిగారి ఎదటికి పోయి సన్యాసి సంగతి చెప్పారు. "రెండు రోజులనుంచీ నాతో ఈ మాట ఎందుకు చెప్పారుకారు! వెంటనే ఆయనను లోపలికి పంపండి!" అన్నాడు మహామంత్రి.

విజ్ఞానచంద్రుడు లోపలికి వచ్చేసరికి మహామంత్రి బంగారు తూగుటుయ్యాలలో మెత్తలను ఆనుకుని కూచుని ఉన్నాడు. దాసీలు ఆయనకు వింజామరలు వీస్తున్నారు. పెద్ద పెద్ద రాజోద్యోగులు ఎడంగా చేతులు కట్టుకుని నిలబడి ఉన్నారు. మహామంత్రి ఏవో పత్రాలు చూస్తున్నాడు.

విజ్ఞానచంద్రుడు ద్వారంవద్దనే నిలబడి కోపంగా, "తత్వాలు రచించే విజయదాసువు నీవేనా?" అని గద్దించి అడిగాడు.



మహామంత్రి తల ఎత్తి, "చిత్తం, స్వామీ! దయ చెయ్యండి! ఆ ఆసనం మీద కూచోండి!" అన్నాడు.

"తత్వజ్ఞానివలె నటించి ఇహసుఖాలు అనుభవించే నీబోటి మోసగాళ్లకుగాని, ఈ ఆసనాలు నాబోటి నిజమైన జ్ఞానులకు కాదు! ఈ విధంగా సుఖాలలో మునిగి తేలటానికి నీకు సిగ్గులేదా?" అన్నాడు విజ్ఞానచంద్రుడు.

"స్వామీ, తమకు తెలియని దేముంది? ఇది సుఖప్రారబ్ధం!" అన్నాడు విజయదాసు.

విజ్ఞానచంద్రుడు నివ్వెరపోయి, "సుఖప్రారబ్ధమంటే ఏమిటి?" అని అడిగాడు.

"కష్టాలలాగే సుఖాలుకూడా ప్రారబ్ధాన్ని అనుసరించి వస్తాయి. వాటినుంచి తప్పించుకోలేం. వాటికి అతీతంగా ఉండటమే జ్ఞాని అయినవాడు చేయవలిసింది!" అన్నాడు విజయదాసు.

"నన్ను మోసం చేస్తున్నావు. నీ సుఖప్రారబ్ధాన్ని నేను తుడిచి పెట్టగలను!" అన్నాడు విజ్ఞానచంద్రుడు.

"కనికరించి అలాగే చెయ్యండి! ఈ సుఖాలు నా ప్రయత్నంవల్ల వచ్చినవికావు. ఇవి నాకు అవసరమూ లేదు!" అన్నాడు విజయదాసు.



ఆ రాత్రి విజ్ఞానచంద్రుడు విజయదాసు ఒంటరిగా ఉన్న సమయంలో, "ఎవరికీ చెప్పకుండా ఈక్షణాన ఉన్నవాడివి ఉన్నట్టు నావెంట బయలుదేరి రా!" అన్నాడు.

"చిత్తం, పదండి!" అన్నాడు విజయదాసు.

అర్ధరాత్రివేళ ఇద్దరూ బయలుదేరారు. తెల్లవారేలోపునే నగరం దాటి చాలా దూరం వెళ్లారు. విజ్ఞానచంద్రుడు మహామంత్రిని మధ్యాన్నందాకా అన్నపానాలు లేకుండా నడిపించాడు. మిట్టమధ్యాన్నమయింది. ఒక ఎడారిలాటి ప్రాంతంమధ్య ఒక పెద్ద మర్రిచెట్టున్నది.

"నువ్వు ఈ మర్రిచెట్టుకిందనే ఉండు. నేను దగ్గిరలో ఏదైనా గ్రామానికి వెళ్లి భిక్ష తెస్తాను. మనం భోజనంచేసి మళ్లీ ప్రయాణం సాగింతాం!" అని విజ్ఞానచంద్రుడు వెళ్లిపోయాడు.

రాత్రల్లా నిద్ర లేకపోవటంచేతా, శరీర శ్రమ అలవాటు లేకపోవటంచేతా, నీడపట్టు చేరగానే విజయదాసుకు నిద్ర ముంచుకు వచ్చింది. ఆయన కటిక నేలమీద పడుకుని గాఢ నిద్రలో మునిగిపోయాడు.

విజ్ఞానచంద్రుడు వెళ్లిన కొద్ది సేపటికి ఒక పెద్ద బిడారు, ఎడారిలో ప్రయాణిస్తూ, ఆ మర్రిచెట్టు దిక్కుగా వచ్చింది.

ఆ బిడారు నేపాళదేశపు రాజుది. ఆయన అత్యవసరమైన రాచకార్యంమీద ఢిల్లీ మహామంత్రిగారికోసం వస్తున్నాడు.

ఈ బిడారుకూడా కిందటి మజిలీ వదిలి తెల్లవారుజామునుంచీ ప్రయాణం సాగించింది. మిట్టమధ్యాన్నమయింది గాని విడిది చెయ్యటానికి వారికి నీడపట్టు ఎక్కడా దొరకలేదు. చివరకు వారుకూడా మర్రిచెట్టు చూసి అక్కడికి వచ్చారు.

చెట్టుకింద సుఖంగా నిద్ర పోతున్న విజయదాసును చూస్తూనే నేపాళరాజు పోల్చుకున్నాడు. వెంటనే ఆయన తన డేరాను విజయదాసు పడుకున్న చోటనే



వేయించి, తన హంసతూలికా తల్పంపైన నౌకర్లచేత ఆయనను పడుకోబెట్టించి, చుట్టూ పన్నీరు చల్లించి, వింజామరాల వాళ్లను ఏర్పాటుచేసి పక్కగా తాను ఒక కుర్చీపై కూచుని మహామంత్రి ఎప్పుడు నిద్రలేస్తాడా అని ఎదురుచూడ సాగాడు. ఏమంటే, యింత జరిగినా విజయదాసుకు నిద్రాభంగం కలగ లేదు.

విజ్ఞానచంద్రుడు భిక్ష పోగుచేసి తిరిగి వచ్చేసరికి మర్రిచెట్టు కింద అనేక డేరాలూ, గుర్రాలూ, ఏనుగులూ కనిపించాయి. సాయుధ భటులు అటూ ఇటూ తిరుగుతున్నారు. ఒక పక్కగా పెద్ద గాడిపొయ్యీ, వంటా కనిపించాయి. అది ఒక పెద్ద మహారాజు శిబిరంలాగా ఉంది.

విజయదాసు ఏమైనాడో, ఈ డేరాలన్నీ ఏమిటో విజ్ఞానచంద్రుడికి అర్థంకాలేదు. తాను అటువెళ్లగానే విజయదాసు వీటన్నిటినీ తెప్పించుకుని ఉంటాడని అనుమానపడ్డాడు, కాని అది ఏమంత సాధ్యంగా కనపడ లేదు.

ఆయన ఏమీ పాలుపోక నిలబడి ఉండగా, నౌకర్లువచ్చి, "ఇది నేపాళరాజుగారి మకాం. నువ్వెవరు? వెళ్లు, వెళ్లు!" అన్నారు.

"నేను విజయదాసుకోసం చూస్తున్నాను!" అన్నాడు విజ్ఞానచంద్రుడు.



"వారింకా నిద్ర లేవలేదు. మా మహా రాజుగారుకూడా వారితో మాట్లాడాలని ఎంతో తొందరపడుతున్నారు! వారి దర్శనం ఇప్పుడు కాదు!" అన్నారు భటులు.

ఈ సమయానికే విజయదాసు నిద్ర లేచి కళ్లు తెరిచాడు. ఎదురుగా నేపాళమహా రాజు కనిపించాడు. ఇద్దరూ ఆలింగనం చేసుకున్నారు.

"మీరెప్పుడు వచ్చారు? నన్నెందుకు నిద్ర లేపలేదు? నావెంట ఒక సన్యాసి ఉండాలి, అయనెక్కడ?" అని విజయ దాసు అడిగాడు.

నేపాళమహారాజు తన భటులను పిలిచి, "ఈ చుట్టు పక్కల ఎక్కడైనా సన్యాసి ఉంటే ఇక్కడికి తీసుకురండి!" అని ఆజ్ఞాపించాడు.

త్వరలోనే విజ్ఞానచంద్రుణ్ణి నేపాళరాజు గుడారానికి తెచ్చారు. ఆయనకు హంస తూలికా తల్పంమీద కూచుని విజయదాసు కనిపించాడు. నేపాళమహారాజే స్వయంగా ఆయనకు విసురుతున్నాడు.

విజ్ఞానచంద్రుణ్ణి చూడగానే విజయ దాసు లేచి నిలబడి, "స్వామీ, మీరు వెళ్ల గానే నాకు గాఢ నిద్ర పట్టింది. నాకు మళ్లీ మెళుకువ వచ్చేసరికి ఈ పాన్పుమీద పడు కుని ఉన్నాను. వీరు నేపాళమహారాజుగారు. వీరు రావటంకూడా నే నెరగను. ఇక మనం బయలుదేరుదామా?" అన్నాడు.

నేపాళమహారాజు కంగారుగా, "నేను తమకోసం మా దేశంనుంచి వస్తున్నాను. ఎక్కడికి పోతారు?" అన్నాడు.

"వద్దు, నాయనా! నేనే పోతాను. నా కంతా అర్థమయింది. నేను నీకేదో నేర్పుదా మనుకున్నానుగాని, నేనే నేర్చుకున్నాను. సుఖప్రారబ్ధం అనుభవించక తప్పదు! అనుభవించు! నీవు మహాజ్ఞానివి! నాకు జ్ఞానోదయం కలిగించావు!" అంటూ విజ్ఞాన చంద్రుడు, తన దారిన తాను వెళ్లిపోయాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1957 జూన్ సంచికలో ప్రకటించబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఏ ఊరుదానవే ఏకాకీ ?

రెండవ ఫోటో : మా అండ జేరవే మాకాకీ !

పంపినవారు : పాకలపాటి క్రీస్తుదాస్, ఎస్. ఎస్. ఎల్. సి., బోర్డు హైస్కూలు, పెనుగంచిప్రోలు - (కృష్ణాజిల్లా)

బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# మొసళ్లు

భూమిమీద గల సరీసృపాలలో (పాకే జంతువులలో) కెల్లా మొసళ్లు పెద్దవి. మొసళ్లలో ఇరవై అడుగుల నిడివి గలవికూడా ఉన్నాయి. మొసళ్లలో రెండు తరహాలున్నాయి. ఒకదాన్ని కాటు మొసలి అనీ, రెండవదాన్ని పిడుక మొసలి అనీ అంటారు. పిడుక మొసళ్లు సాధారణంగా మనుషుల జోలికి రావు.

మొసళ్లు తరుచు నీటిలోనే ఉంటాయి. వీటి పాదాలు జాలపాదాలు. అయినా మొసళ్ళు యీదేటప్పుడు పాదాలను ఉపయోగించవు, తోకలను ఉపయోగిస్తాయి. వాటి చెవులపైన చర్మపు ముడతలుంటాయి. మొసళ్లు నీటిలోపల ఉన్నప్పుడీ చర్మం ముడుచుకుని నీరులోపలికి వెళ్లకుండా చేస్తుంది.

మొసళ్లకు కళ్ళూ, ముక్కుపుటాలూ ఉబ్బెత్తుగా, పైకి పొడుచుకుని వచ్చివుంటాయి. అందుచేత మొసళ్లు తమ కళ్లనూ, ముక్కులనూ మాత్రమే నీటికి పైగా ఉంచి మిగిలిన దేహాన్ని నీటిలో ముంచి, పైన జరిగేదంతా చూడగలవు, ఊపిరి పీల్చగలవు.

చలిదేశాలలో మొసళ్లు జీవించలేవు; అవి ఉష్ణమండలంలో మాత్రమే ఉంటాయి. మొసళ్ళు శీతలరక్త ప్రాణులు. అంటే వాటి రక్తంయొక్క ఉష్ణం వాతావరణాన్నిబట్టి మారుతుంది. అందుచేత అవి వెచ్చనినీటిలో మాత్రమే జీవించగలవు. ఒకప్పుడు ఇంగ్లండు చలిదేశం కాదు, సమశీతోష్ణంగా ఉండేది. అప్పుడక్కడ మొసళ్ళుండేవి.

ఒకరకానికి చెందిన మొసళ్ళు గట్టిగా, మైలుదూరం వినపడేలాగ, అరుస్తాయి. సరీసృపాలలో పెద్దగొంతు గలవి మొసళ్లు మాత్రమే.

మొసలికి తోకలో చాలా బలం ఉన్నది. అది తోకతో కొట్టి మనిషినిగాని, లేడినిగాని సులువుగా కిందపడగొట్టగలదు. ఇక నీటిలో ఉన్నప్పుడు దాని బలం చెప్పనలవికాదు.



అయితే దానికి ఒకటే లోపం—అది మెడ పక్కకు తిప్పలేదు. ఈ కారణంచేత అనేక మంది మొసళ్లనుంచి తప్పించుకోగలిగారు.

మొసళ్లు పూర్తిగా మాంసాహారులు. వాటి దవడలు బలంగానూ, వాటి దంతాలు వాడిగానూ ఉంటాయి.

మొసలి గుడ్డుపై పెంకు చాలా గట్టిగా ఉంటుంది. అయితే మొసలిపిల్లల ముట్టెల మొనలు చాలా బలంగా ఉంటాయి. వీటి సహాయంతో అవి గుడ్డును ఛేదించుకుని బయటికి వస్తాయి.

మొసలి ఒక తడవకు 20 గుడ్లకు పైగా పెడుతుంది. మొసలి చర్మం చాలా మందంగా ఉంటుంది. దానితో తయారుచేసిన చెప్పులూ, సంచులూ చాలా అందంగా ఉంటాయి. చర్మంకోసం మొసళ్లను పట్టుకుంటారు. మొసలిచర్మానికి గల గిరాకీ మూలంగా కొన్ని ప్రాంతాల్లో మొసళ్ళు లేకుండాపోయే ప్రమాదం ఉన్నది. అందుచేత ఇప్పుడు అక్కడక్కడా మొసళ్లను మడుగులలో పెట్టి పెంచుతున్నారు.

ఒక్కొక్క దేశంలో మొసళ్లు ఒక్కొక్క రకంగా ఉంటాయి. కొన్నిటికి మూతులు చాలా పొడుగుగా ఉంటాయి. మడుగులలో పెట్టి పెంచే మొసళ్లలో ఒక జాతి మొసళ్లకు మూతులు చాలా కురచగా ఉన్నాయి. ప్రపంచం మొత్తంమీద 20కి పైబడిన రకాల మొసళ్లున్నాయి.

ఆఫ్రికాలో అనేక ఘాతుకమృగాలున్నాయిగాని, అక్కడ మనుషులను అధికంగా చంపే మృగాలు మొసళ్లని చెబుతారు. అక్కడ చంపిన ఒక మొసలి కడుపులోనుంచి ఏడు పందిముళ్ళూ, 11 ఇత్తడి చేతిమురుగులూ, మూడు తీగమురుగులూ, ఒక గాజు పూసల దండా, 14 చేతి ఎముకలూ, కాలి ఎముకలూ, 3 వెన్ను ఎముకలూ, 18 చిన్న పెద్ద రాళ్ళూ, ఒక నారతాడూ బయటికి వచ్చాయట!






ప్రొఫెసర్ పి. సి. సర్కార్

అగ్గిపెట్టెతో చేసే ట్రిక్కు చాలా తెలివైనది. ఇది ఎలా చేయాలంటే: ఒక మామూలు అగ్గిపెట్టెను తీసుకువచ్చి, పదునైన కత్తితో దాని మధ్యను, ఇంచుమించు అడుగంటా కోయాలి. ఇలా కోసిన కంతలో ఒక మామూలు పేక ముక్క దూర్చాలి. (బొమ్మలో చూడండి) అగ్గిపెట్టెలోపలి సొరుగును ఈ పేకముక్క కదలకుండా ఉంచినప్పటికీ, దానిని ఇటునుంచి అటూ, అటునుంచి ఇటూ తోసి చూపుతాడు ఐంద్రజాలికుడు. (సొరుగు ఎలా ఇటూ అటూ జరిగేదీ బొమ్మలో చూపబడీ, సూచించబడీ ఉన్నది.) ఈ ట్రిక్కు చూసి అందరూ విస్మయం చెందుతారు. ఈ ట్రిక్కుకోసం ఈ అగ్గిపెట్టె సొరుగును ముందుగానే సిద్ధం చేసి ఉంచిన సంగతి వారికి తెలీదు.

ఈ ట్రిక్కు చేసి చూపదలిచిన ఐంద్రజాలికుడు ముందుగానే ఒక అగ్గిపెట్టెను తీసుకుని దానిని ఈ కింది విధంగా తయారుచేసి పెట్టుకోవాలి. అగ్గిపెట్టె తాలూకు పైడొక్కును, అడుగున తప్ప మిగిలిన మూడు పక్కలా తెగేలాగు పదునైన కత్తితో కోయాలి. తరువాత అగ్గిపెట్టె సొరుగును తీసి దానినుంచి అగ్గిపుల్లలను తీసివేయాలి. ఈ పుల్లలన్నిటినీ మూడు భాగాలుగా కొయ్యాలి. ఆ తరువాత సొరుగు రెండు పక్కలా ఉండే చెక్కను మూడు భాగాలుగా కోసి మధ్యభాగం తీసివేయాలి. అడుగుభాగం మాత్రం అలాగే ఉంటుంది. ఇప్పుడు సొరుగులో 1 అంకె సూచించే ప్రాంతంలో తలలుగల అగ్గిపుల్ల ముక్కలను బంకతో అంటించి పేర్చాలి. అదేవిధంగా

3 అంకె ప్రాంతంలో ఆ పుల్లల చివరలు అంటించాలి. 2 అంకె సూచించే భాగానికి అడుగు తప్ప పక్కలుండవు, అందులో పుల్లలుకూడా ఉండవు. ఈ విధంగా అగ్గిపెట్టెను తయారు చేసిన






తరవాత అందులో పేకముక్క దూర్చినప్పటికీ సొరుగు వెనకకూ ముందుకూ జరుగుతుంది. అందరికీ ఇది అద్భుతంలాగా తోస్తుంది. ప్రేక్షకులు పేకముక్కలోనే ఏదో మోసం ఉంటుందనుకుంటారు. ట్రిక్కు పూర్తి అయినాక ఆ పేకముక్కలో మోసమేమీ లేదని చూపటానికిగాను దానిని ప్రేక్షకులకు అందించవచ్చు. ఇది చాలా మంచి ట్రిక్కు కాని దీనిని ఒకే ప్రేక్షకుల ఎదట రెండుసార్లు చేయగూడదు. అగ్గిపెట్టె సొరుగులో అగ్గిపుల్ల ముక్కలను బాగా అంటించాలి. లేకపోతే అవి సమయానికి కింద పడిపోయి మోసం బయటపడగలదు.



# వార్తలు-విశేషాలు

దేశంలో మెట్రిక్యులేట్లకు పనిపాట్లను కల్పించి నిరుద్యోగ నిర్మూలన చేయటానికి ఇండియా ప్రభుత్వం పథకం తయారుచేసింది 1957-58 లో. వివిధ ప్రాంతాలలో ఉత్పత్తికేంద్రాలు ప్రారంభించటానికిగాను 17 లక్షల రూపాయలు మంజూరు చేశారు. ప్రతి కేంద్రంలోను రెండు షిఫ్టులలో, 300 మంది మెట్రిక్యులేట్లకు పనిపాటులు చూపించబడుతాయి.

*   *   *   *

ఈమధ్య రష్యాలో భారతీయ వైద్యాన్నిగురించి ఒక గ్రంథం ప్రకటింపబడింది. ప్రాచీన రష్యన్ చికిత్సా విధానంలో మన దేశవు పద్ధతులు ఎలా అవలంబింపబడ్డాయో వివరిస్తున్నదీ గ్రంథం. కర్త నికొలాయ్ బొగొయలెన్స్కి. ఇందులో, మొహంజోదారో యుగం మొదలుకుని తైమూరు దండయాత్రవరకు ఉంటూవచ్చిన వైద్య సంప్రదాయాలు చక్కగా నిరూపించ బడినై.

*   *   *   *

స్కాండినేవియా ఎయిర్‌లైన్స్ కంపెనీకి చెందిన రీడార్ వైకింగ్ ప్రయాణీకుల విమానం తొలిసారిగా టోకియోలో బయలుదేరి, ఉత్తర ధృవంమీదుగా 31 గంటలసేపు ప్రయాణం చేసి, కోపెన్‌హేగన్ చేరుకుంది.

*   *   *   *

12 లక్షల ఖర్చుతో, విజయవాడలో నిర్మించబోయే సౌత్ ఇండియా రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ పరిశోధనాలయ భవనాలకు శంఖుస్థాపన జరిగింది.



**బొం**బాయి రాష్ట్ర మాజీ ముఖ్య మంత్రి శ్రీ బి. జి. ఖేర్ మార్చి 8-వ తేదిన గుండె జబ్బువల్ల హఠాత్తుగా మరణించారు. అప్పటికి వారి వయస్సు 68 సంవత్సరాలు. ఆయనపట్ల గౌరవసూచకంగా పూనా, బొంబాయి నగరాలలో ప్రభుత్వ కార్యాలయాలు మూయబడినై.

*　　　*　　　*　　　*

**ద్వి**తీయ ప్రణాళిక కాలంలో 20 లక్షల ఎకరాలకు పైగా సాగులోకి తీసుకురావటానికి ఆంధ్ర ప్రదెశ్ ప్రభుత్వం కార్యక్రమాన్ని రూపొందించింది. దీని ఫలితంగా 1960-61 నాటికి సాలీనా ఆహారధాన్యాల ఉత్పత్తి 73 లక్షల టన్నులవరకు పెరుగుతుందని అంచనా.

*　　　*　　　*　　　*

**మ**ద్రాసు మాజీ ముఖ్యమంత్రి, ఒరిస్సా మాజీ గవర్నరు అయిన శ్రీ పి. ఎస్. కుమారస్వామి రాజా మార్చి 16-వ తేది తెల్లవారుజామున కాలధర్మం చెందారు.

*　　　*　　　*　　　*

**మా**ర్చి 22 నుంచీ, శకమానంపై ఆధారపడిన జాతీయ పంచాంగం మనదేశంలో అమల్లోకి వచ్చింది. ఇంతవరకూ వాడుకలో ఉన్న గ్రెగరియన్ పంచాంగంకూడా కొత్త పంచాంగంతో పాటు అమల్లో ఉంటుంది. కొత్త పంచాంగంలో చైత్రం మొదటి మాసం.

*　　　*　　　*　　　*

**1961** లో రవీంద్ర కవీంద్రుని జన్మదినం శతదినోత్సవ కార్యక్రమం జరపటానికి సాహిత్య అకాడమి అఖిలభారత సంఘాన్ని నియమించింది. దీనికి చెయిర్మను ప్రధాని నెహ్రూ.

*　　　*　　　*　　　*

**సు**మారు ఒక కోటి సలభై లక్షల మంది ప్రజలకు ఆయా అభివృద్ధి కార్యక్రమాలలో శిక్షణ ఇవ్వటానికి ఒక మహత్తర కార్యక్రమం తలపెట్టబడినట్టు కేంద్ర సమాజవికాస శాఖా మంత్రి చెప్పారు. వ్యవసాయం, పశుపోషణ, గ్రామపరిశ్రమలు, ప్రజారోగ్యం, పారిశుద్ధ్యం, సహకారం, పంచాయతీలు, రాకపోకల సౌకర్యాలు, శిశుసంక్షేమ కార్యక్రమాలు మొదలైన విషయాలలో తర్ఫీదు యివ్వబడుతుంది.



# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు తోటలో జామకాయలు కోసుకుతినేందుకు వెళ్లారు. వెంట 'టైగర్' కూడా వుంది. తోట యజమాని, దాసూ వాసూలను పట్టుకునేందుకు పరుగెత్తుకువచ్చాడు. చెట్టు మొదట్లోవున్న పుట్టలోంచి పాము ఒకటి బయటికివచ్చి, అతడిమీద పడబోయింది. 'టైగర్' పామును చూచి పెద్దగా మొరిగింది. పాము, బుస్సుమంటూ 'టైగర్' కేసి తిరిగింది. ఆ అదనులో యజమాని పామును చంపేశాడు. 'టైగర్' తనకు సహాయపడినందుకుగాను, యజమాని దాసూ, వాసూలకు స్వయంగా జామకాయలు కోసియిచ్చాడు.





Printed by B. NAGIREDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'




సోల్ ఏజంట్లు : ఎం. ఎం. ఖంబట్‌వాలా
రాయపూర్ :: అహమదాబాదు




# అమృతాంజనము

★

అన్ని

నొప్పులకు

దివ్యామృతము




అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు-4. బొంబాయి-1 - కలకత్తా-7.

## చందాదారులకు మనవి



పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

Photo by A. .. Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

మా అండ జేరవే మా కాకీ!

పంపినవారు:
పి. కె. దాస్ - పెనుగంచిప్రోలు

